


విజయవాడలో మాతృభాషా మాధ్యమ వేదిక ఆధ్వర్యంలో ఫిబ్రవరి 19న జరిగిన ఒక రోజు సత్యాగ్రహ దృశ్యం. మున్సిపల్ పాఠశాలల్లో ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెడుతూ ప్రభుత్వం తీసుకొచ్చిన జి.వో. నెం.14ను వ్యతిరేకిస్తూ జరిగిన ఈ సత్యాగ్రహ దీక్షలో రచయితలు, సంపాదకులు, మేధావులు, తెలుగు భాషాభిమానులు పాల్గొన్నారు.

సాహిత్య
ప్రస్థానం
మార్చి 2017
సంపుటి : 16 సంచిక : 3

# ట్రంపోన్మాదం విలయతాండవం

అగ్రరాజ్యం ముద్రతో డాలరీకరణను ప్రపంచీకరణగా మనందరిపై రుద్దిన దేశాధ్యక్షుడే ఇప్పుడు అడ్డం తిరిగిపోయాడు. అనాగరిక వాదనలతో అమానుష దాడులకు సంకేతమైనాడు. అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో విజయం సాధించిన డోనాల్డ్ ట్రంప్ వికృత వేషాలూ విపరీత వాదనలూ నిజానికి ఆ వ్యవస్థ దుర్నీతి ఫలితాలే గాని కేవలం వ్యక్తిగతంగా చూడటానికి లేదు. అమెరికా ఫస్ట్ అన్న మాట కొత్తదేమీ కాదు. ఆ పేరుతోనే వారు ప్రపంచాధిపత్యం సాగించారు. అందుకోసమే మన మేధాశక్తిని యువ సాంకేతిక నిపుణుల సమర్థతనూ కూడా పూర్తిగా ఉపయోగించుకున్నారు. మరోవైపున మనకు అవకాశాలు కుదిస్తూ ఎఫ్‌డిఐల ప్రవేశానికి తమ సరుకుల ప్రవాహానికి అవకాశాల కోసం ఒత్తిడి తెచ్చారు. వారిక్కడికి వచ్చినా మనం అక్కడకు వెళ్లినా లాభాలు మాత్రం పోగుపోసుకున్నారు. అయితే పైన పటారం లోన లొటారంలా సైనిక శక్తితో పెత్తనం సాగించారన్న వాస్తవానికి ఆ దేశ ఆర్థిక వ్యవస్థ డొల్లగా మారింది. అప్పులపాలైంది. నిరుద్యోగం సామాజిక ఉద్రిక్తతలు పెరిగిపోయాయి. నమ్మిన బంటు వంటి బ్రిటన్ పాలకులు కూడా వీడ్కోలు చెప్పే పరిస్థితి ఏర్పడింది. ఇలాటి సంక్షోభాలు తలెత్తినప్పుడల్లా ఇతర దేశాల మీద మతాలు జాతుల మీద కోపం పెంచడం పాలకులకు అలవాటైన విద్య. హిట్లర్ నుంచి ట్రంప్ వరకూ చూస్తున్నదే ఇది. కనుకనే ఇప్పుడు ఒక్కసారిగా వీసా నిబంధనలు కఠినతరం అంటూ ఉపాధికోసం వెళ్లిన వారిపై ఉద్రేకాలు పెంచారు. హైదరాబాద్ ఇంజనీర్ కూచిబొట్ల శ్రీనివాస్ కాల్చివేతతో ట్రంప్ ఉన్మాద కాండ పర్యవసానాలేమిటో తెలిసిపోయింది. భూతల స్వర్గం అనుకుని వెళ్లిన వారు ఇప్పుడు బతికుంటే బలుసాకు తినొచ్చని బయలుదేరి రావాలనుకుంటున్నారు. కొత్తగా రావడం మంచిది కాదని హెచ్చరిస్తున్నారు. ఇదో తలకిందులు చరిత్ర. అక్కడ భారతీయుల సంఖ్య కూడా గణనీయంగా మూడు లక్షల పైనే వుంది గనక ఈ సవాలు సెగ మనకే ఎక్కువగా తగులుతున్నది. అయితే ఇప్పటివరకూ అమెరికాకు ఉపగ్రహాలుగా మారిపోయిన మన పాలకులు ఇప్పుడు కూడా పెద్దగా నోరు మెదపడం లేదు. వీసాలపై వాస్తవికంగా వుండాలని సన్నాయినొక్కులతో సరిపెడుతున్నారు. కాబట్టి ఈ సవాలు తీవ్రమైందే. సంక్లిష్టమైందే. తమ భద్రతకోసం ఎవరి నిర్ణయం వారు తీసుకోవడంతో పాటు మొత్తంగా ఈ పరిణామాల పాఠాలు కూడా గ్రహించడం అవసరం. మొదటి నుంచి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దుష్ఫలితాల గురించి హెచ్చరిస్తున్న సాహితీ స్రవంతి, ప్రస్థానం ఈ ఉన్మాద కాండను ఖండిస్తున్నాయి. భారతీయులతో సహా అక్కడున్న వారందరికీ పూర్తి భద్రత కల్పించేలా ప్రభుత్వాలు వత్తిడి తేవాలి. ఏడు ముస్లిం దేశాలకు తలుపులు మూసి మతాల మధ్య మంటలు పెట్టే ట్రంప్ పోకడలను కూడా బహుమతాల దేశంగా మనం తప్పక నిరసించాలి. ఈ విషయంలో కేంద్రం మెతక వైఖరి విడనాడి భారతీయులకు రక్షణ కల్పించాలి.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజీ, గంగాధర్

ఈ సంచికలో ...





మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం,
డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్టీసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# ఈ శతాబ్దం నాది!

- పి.ఎస్. శ్రీనివాసరావు
9441307185



నా కు తిన్నగా వుండం చాతకాదు
నా పుట్టుకే అలాంటిది
నా వూపిరి మాటకేం గానీ నేనందరి వూపిరిని

ఇంతింతై వటుడింతయై అన్న చందాన పెరిగినదాన్ని
పోల్చుకున్నవాళ్ళు కొందరు నన్ను పోగేసుకున్నారు
నన్నక్కర్లేదన్నవాళ్ళేవో భజనగీతాలు పాడుకున్నారు ..కోనీ!
చివరికి మళ్ళా నా పాటలకే వరసలు కడతారు
నేనడుగుపెట్టిన చోటల్లా నాదే
నా ఉఛ్వాశనిశ్వాసాల్లో
చరిత్ర పుడుతుంటుంది, చెరిగిపోతుంటుంది
దుర్భిక్షాల్ని సుభిక్షంగా వుంచడం
యుద్ధాల్ని కనుసైగల్లో తిప్పడం
బియ్యపుగింజల బాసల్ని తుంగలో తొక్కడం
బంగారుగుడ్ల బాతుల్ని మెడనరకడం నా ప్రవృత్తి
నేనందని ద్రాక్షనైనా
నాకోసం కవితాగానాలు కోకొల్లలు
***The "__woods" are lovely dark and deep***
***To make my wishes true to sweep***
నాక్కావలసిన తలల్ని తగిలించుకోవడానికి
నేను తరుచూ మొండేలనే కోరుకుంటాను
తెలివి త(తె)ప్పించే సాధనాలన్నీ నాకోసమే వుంచుకుంటాను
***I like to behead every throne***
***To have a pork of my dish***
వురికొయ్యలు నన్నక్కడక్కడా అపహసిస్తేనేం?
నా అంతటి వారెవరు!?...నేనే!
నా తరవాత!?...నేనే!!!
యీ శతాబ్దం నాది
(భూగోళం చేతులకి రెక్కలొచ్చేవరకు
బయటికి పిల్చినవాడు మళ్ళా సీసాలో బిగించిన వరకూ...
***(woods refer to Brettonwoods agreement)***

---

## ఫిబ్రవరి నెల పురస్కారాలు

| | | |
|---|---|---|
| **ఆశాద్వీపంలో రచయితల 'వనభోజనం'** | **కళాత్మకత** | **వేగం** |
| వ్యాసానికి: రూ.500/- | కథకు: రూ.700/- | కవితకు : రూ .500/- |
| రచయిత :అవధానుల మణిబాబు | రచయిత : పిళ్ళ కుమారస్వామి | రచయిత : దుప్పాడ రామకృష్ణనాయుడు |

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి
పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

\- ఎడిటర్

# వడ్రంగి పిట్ట



మూలం: మార్క్‌ట్వేన్
తెలుగు: ఓల్గా

జంతువులు తమలో తాము మాట్లాడుకుంటూ ఉంటాయి. అందులో సందేహమేమీ లేదు. ఐతే వాటిని అర్థం చేసుకునే మనుషులు మాత్రం చాలా తక్కువ మంది ఉంటారు. నాకు అట్లా అర్థం చేసుకునే మనిషి ఒకరు తెలుసు. అతను నడి వయసు మనిషి. మంచి మనసున్నవాడు.

కాలిఫోర్నియాలో ఓ మూల అడవులకూ కొండలకూ దగ్గరగా ఉంటూ తన పొరుగునే ఉన్న జంతువుల్నీ, పిట్టల్నీ బాగా గమనించాడు. ఎంత బాగా గమనించాడంటే అవి ఏమంటున్నాయో వెంటనే మన భాషలో చెప్పగలిగేంతగా. అతని పేరు జిమ్‌బేకర్. అతని ఉద్దేశం ప్రకారం కొన్ని జంతువులకంతగా విద్యాగంధం ఉండదు. అవి చాలా మామూలుగా మాట్లాడతాయి.

అలంకార యుక్తంగా మాట్లాడలేవు. ఐతే కొన్ని జంతువుల భాషా జ్ఞానం చాలా గొప్పది. భాష మీద అధికారంతో తడుముకోకుండా మాట్లాడగలవు. అందుకే అవి ఎక్కువ మాట్లాడతాయి కూడా. తాము చక్కగా మాట్లాడ గలమని కూడా వాటికి తెలుసు. తమ భాషా చాతుర్యాన్ని ప్రదర్శించటంలో అవి ఆనందాన్ని పొందుతాయి. చాలా కాలం జాగ్రత్తగా గమనించాక అన్నిటిలోకి వడ్రంగి పిట్టలు మంచి సంభాషణ చతురులని బేకర్ నిశ్చయించుకున్నాడు.

బేకర్ ఈ రకంగా చెప్పాడు.

“వడ్రంగి పిట్టలు చాలా తెలివైనవి. వాటికి మిగిలిన పిట్టలకన్నా అనుభూతి చెందే శక్తి ఎక్కువ. పైగా తమ అనుభూతిని మాటల్లో చెప్పగలవు కూడా. అదీ మామూలు మాటల్లో కాదు. గ్రాంధిక భాషలో, అలంకారాలూ, సమాసాలతో మిరుమిట్లు గొలిపే భాషలో చెప్పగలవు. ఆ పిట్ట మాటల కోసం తడుముకోవడం అంటూ ఎప్పుడూ ఉండదు. మనుషులు కూడా అట్లా మాట్లాడరు. ఈ వడ్రంగి పిట్ట మాట్లాడినంత వ్యాకరణ యుక్తంగా ఇంకో పిట్టగానీ జంతువుగానీ మాట్లాడలేదు.

పిల్లి అన్నింటిలోకి మంచి వ్యాకరణం మాట్లాడగలదని పేరు నిజమే. కానీ పిల్లులకు కోపం వచ్చినపుడూ, ఏ అర్ధరాత్రో దేనికోసమో పోట్లాడుకుంటున్నప్పుడూ వినండి పిల్లుల

వ్యాకరణం సొగసు. ఇక మీరు నోరెత్తలేరు. చాలా మంది అమాయకులు పోట్లాడుకుంటూ పిల్లులు చేసే చప్పుడు భయంకరంగా ఉంటుందనుకుంటారు కానీ నిజానికి భయంకరంగా ఉండేది అప్పుడవి చేసే వ్యాకరణ ప్రయోగాలు. ఈ వడ్రంగి పిట్టలు వ్యాకరణ దోషాలతో మాట్లాడగా నేనెన్నడూ వినలా. ఒకవేళ తప్పి జారి మాట్లాడినా అవి మనుషుల్లాగే సిగ్గుపడి నోరు మూసుకుని అక్కడినుంచి వెళ్ళిపోతాయి.



వడ్రంగి పిట్ట ఒంటిమీద రెక్కలున్నాయి గనుక అది పిట్టే. అది ఏ చర్చీకీ చెందదు గనుక కూడా అది పిట్టే నని నిశ్చయంగా చెప్పొచ్చు. లేకపోతే అది మనలాంటి మనిషే. దానికున్న సహజ శక్తులూ, అనుభూతులూ, ఆసక్తులూ మానవ స్వభావానికి సరిపోతాయి. ఈ కాంగ్రెస్ సభ్యుల కంటే ఈ పిట్టకు ఎక్కువ ఆదర్శాలేం లేవు. ఈ పిట్ట అబద్ధమాడుతుంది. దొంగతనం చేస్తుంది. మోసం చేస్తుంది వంచిస్తుంది. చేసిన వాగ్దానాలు తరచూ మర్చిపోతుంటుంది. అన్నమాట తప్పకూడదనే విషయం నువ్వెంత శ్రమపడీ ఈ పిట్ట బుర్రలోకి ఎక్కించలేవు. అన్నిటినీ మించి ఎవరినైనా సరే విమర్శించగలదు. పిల్లి కూడా ఆ పని చెయ్యగలదంటారా. సరే పోటీ పెట్టి చూడండి. మీ పిల్లి ఎక్కడుంటుందో తెలుస్తుంది. మరి మాట్లాడకండి. ఈ విషయాలు నాకు చాలా బాగా తెలుసు. మంచిగా చక్కగా చివాట్లు పెట్టడంలో కూడా ఈ వడ్రంగి పిట్ట అందర్నీ మించి పోతుంది.

ఔనండి. ఈ పిట్ట అచ్చం మనిషే. ఈ పిట్ట ఏడ్వగలదు, నవ్వగలదు, సిగ్గుపడగలదు, ఆలోచించగలదు, పథకాలు వేయగలదు, చర్చించగలదు, పుకార్లు పుట్టించగలదు. నవ్వించగలదు. తానెంత తెలివి తక్కువ దద్దమ్మో కూడా మీకు మల్లెనే వడ్రంగిపిట్ట కూడా గ్రహించగలదు. బహుశ మీకంటే బాగా కూడా. అది మనిషి కాకపోతే పోనీ- మనిషే తాను వడ్రంగిపిట్ట ననుకోవచ్చు. ఈ పిట్టల గురించి నేనొక విషయం చెబుతా వినండి. ఇది నిజంగా జరిగిందే. నేను ఈ పిట్టల భాష బాగా అర్థం చేసుకుంటున్న రోజుల్లో ఓ చిన్న సంఘటన జరిగింది. ఏడేళ్ళ క్రితం నేను కాకుండా ఈ ప్రాంతంలో ఉండే ఒక్క వ్యక్తి ఇక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అప్పటి నుంచీ అదిగో అతని ఇల్లు ఖాళీగానే ఉంది. అది చెక్కలతో కట్టారు. ఒకటే పెద్దగది. ఒక ఆదివారం నేనిట్లాగే వరండాలో కూర్చుని ఉన్నాను. నీలపు కొండలకేసి చూస్తూ, చెట్ల ఆకులు ఒంటిరిగా గలగలమనటం వింటూ, పదమూడేళ్ళ నుంచీ ఏ కబురూ తెలియని మా ఇంటి గురించి ఆలోచిస్తూ ఎండపొడలో కూర్చోని ఉన్నాను.

అప్పుడొక వడ్రంగిపిట్ట ఒచ్చి ఆ ఇంటి కప్పుమీద వాలింది. వాలుతూనే 'అరే... నేనొకటి కనిపెట్టాను' అన్నది. అట్లా అంటుంటే నోట్లోంచి జారి కిందపడిన ఓక్‌పండును కూడా అది పట్టించుకోలేదు. దాని దృష్టంతా ఆ కనిపెట్టిన విషయం మీదే ఉంది. అది కప్పులో ఉన్న చిన్న కన్నం. అది తల ఒక పక్కకు ఒంచి చూసి మెరుస్తున్న కళ్ళతో పైకి లేచింది. రెక్కలు టపటప లాడించింది."ఇది కన్నమే అచ్చం అలాగే ఉంది. కాకపోతే అప్పుడనండి" అన్నది.

మళ్ళీ తలవంచి ఇంకోసారి చూసింది. దాని కళ్ళు ఆనందంతో నిండిపోయాయి. రెక్కలూ తోకా ఆడిస్తూ "ఇది చిన్న కంతే- ఎంత అదృష్టం. ఎంత చక్కని కంత కనపడింది" అంటూ కిందకు ఎగిరివచ్చి ఓక్ పండును తీసుకొచ్చి ఆ కంతలో పడేసింది. అంతలోనే ఆ పిట్ట ముఖంలో చిరునవ్వు మాయమైంది.

నెమ్మదిగా ఏదో వింటున్నట్టుగా కూర్చుంది. పండు కన్నంలో పడిన చప్పుడే వినపడదేం అంటూ మళ్ళీ కంతలోకి చూసింది చాలా సేపు. తలపైకెత్తి ఒకసారి విదిలించుకుని మళ్ళీ ఇంకోవైపు నుంచీ చూసి మళ్ళీ తల విదిలించింది. ఆ కంతను పరిశీలించటం ప్రారంభించింది. అన్ని కోణాల్నించీ, చుట్టూ తిరిగి అందులోకి చూసింది. ఏమీ ఉపయోగం కనిపించలా. కప్పు అంచుమీద కెగిరి, కూచుని ఆలోచించి ఒకసారి కుడికాలుతో తల గోక్కుంది. చివరకు "నాకిది చాలా ఎక్కువే. పెద్ద పొడవైన కన్నం. ఇక్కడ ఆలోచిస్తూ కూర్చునే సమయం కాదు. చేయాల్సిన పని చాలా వుంది. ఏమైనా సరే దీని సంగతేమిటో చూడాల్సిందే" అన్నది.

మళ్ళీ ఎగిరి ఇంకో ఓక్ పండు తెచ్చి అందులో పడేసింది. మరుక్షణమే అదేమయిందో చూడాలని కన్నంలో తలదూర్చింది. కానీ అప్పటికే ఆలస్యమయింది. కాసేపు చూసి తలపైకెత్తి నిట్టూర్చి "దీని దుంపతెగా ఇదేమిటో మాయగా ఉందే. ఏ దారీ కనపడదు. ఏమైనా ఇంకోసారి చూద్దాం" అంటూ ఇంకో ఓక్ పండు తెచ్చింది. అది కన్నంలో పడేసి ఏమయిందో చూడటానికి ఎంతో ప్రయత్నించింది. కానీ ఏమీ లాభం లేకపోయింది. "ఇలాంటి కంత ఇంతవరకూ చూడలేదు. చాలా కొత్తరకంలా ఉంది" అంటూ తెగ ఆలోచించింది. కాసేపటూ ఇటూ ఊరికే తిరిగింది. తల ఊపుకుంటూ తనలో తాను మాట్లాడుకుంది. ఒక పిట్ట ఒక చిన్న విషయం గురించి అంత ఆలోచించటం నేనెన్నడూ చూడలా. ఆలోచన ముగిశాక మళ్ళీ కన్నం దగ్గరకు ఒచ్చి అరక్షణం చూసి "సరే నువ్వొక పొడవైన లోతైన కన్నానివే కావొచ్చు. కానీ నిన్ను ఓక్ పళ్ళతో నింపటం మొదలెట్టాను నేను. వంద సంవత్సరాలకైనా సరే నిన్ను నింపకపోతే నేనొక గాడిదనే" అన్నది. అలా అని అక్కడినుంచి కదిలింది. అట్లా పని చేసిన పిట్టను మనం పుట్టాక ఎన్నడూ చూసి ఉండం. ఒక నీగ్రోవాడిలాగా ఆ పనిలో మునిగింది. రెండున్నర గంటలసేపు నిర్విరామంగా ఆ పిట్ట పళ్ళు తెచ్చి ఆ కంతలో వేయటం నిజంగా చూడాల్సిన దృశ్యం. మళ్ళీ కంతలోకి చూడను కూడా లేదు. పండు తేవటం కంతలోకి వేయటం అంతే. చివరికి ఇక దాని రెక్కల్లో శక్తి లేకుండా పోయినప్పుడు ఆగింది. మంచు పట్టిన కుండలా దాని శరీరం నిండా చెమటలు కారుతున్నాయి. 'ఇప్పుడు నీక్కావల్సినన్ని పండ్లు వేశాననుకుంటా' నంటూ ఒంగి చూసింది. నిజంగా నన్ను నువ్వు నమ్మాలి. తలపైకెత్తేసరికి ఆ పిట్ట పూర్తిగా పాలిపోయి వుంది. "ముప్పయ్యేళ్ళపాటు ఒక కుటుంబానికి సరిపోయేటన్ని పళ్ళు తెచ్చి వేశాను. కానీ వాటిలో ఒక్కటైనా కనిపించదేం? ఒక్కటి కనిపించినా రెండు నిమిషాల్లో నేను చచ్చి మ్యూజియంలో ఉండటానికి సిద్ధమవుతాను" అన్నది. మళ్ళీ నెమ్మదిగా కప్పు అంచుమీదకు చేరుకొని కాసేపు నివ్వెరపాటు నుంచి తేరుకుని బుర్రను బాగుచేసుకుంది. అప్పుడు ఇంకో వడ్రంగిపిట్ట అటువైపుగా పోతూ ఈ పిట్ట ధ్యానాన్ని చూసి ఏమయిందని అడిగింది. ఈ పిట్ట మొత్తం



విషయమంతా చెప్పి "నా మాట నమ్మకపోతే స్వయంగా చూడు" అంది. ఆ రెండో పిట్ట వెళ్ళి చూసి ఎన్ని పళ్ళు వేశావని అడిగింది. రెండు టన్నులకు ఏమీ తక్కువ వుండవు అన్నది ఈ పీడిత పిట్ట. రెండో పిట్ట మళ్ళీ చూసింది. కానీ దానికేమీ అర్థం కాలేదు. దాంతో అది ఓ కేకవేసి మరి మూడు పిట్టల్ని పిల్చింది. అన్నీ ఒచ్చి ఆ కంతను పరిక్షించాయి. మళ్ళీ ఈ పిట్ట చేత విషయమంతా చెప్పించాయి. మనుషులు ఎన్ని బుద్ధి తక్కువ ఆలోచనలు చేయగలవో అన్నీ ఈ పిట్టలు చేశాయి. ఇంకా పిట్టల్ని పిల్చాయి. చివరికా కప్పంతా రంగు పూసినట్లుగా పిట్టలు వాలాయి. దాదాపు ఐదువేల పిట్టలు ఒచ్చాయి. ఇక చర్చలు తిట్లూ ఒకటేమిటి. ఆ మాటలు నువ్వీక వినలేవు. ప్రతి పిట్టా కన్నంలోకి చూడనూ, తన తెలివంతా బైట పడేటట్టూ తనకంటే ముందు చూసిన పిట్ట చెప్పిన దానికన్నా భిన్నంగానూ ఉండే మాట చెప్పనూ. ఆ ఇల్లంతా కూడా పరీక్షించాయి. ఆ ఇంటి తలుపులు సగం తెరుచుకుని ఉన్నాయి. చివరికో ముసలి పిట్ట ఆ తలుపుల గుండా దూరి చూసింది. అక్కడ పళ్ళన్నీ చిందర వందరగా ఇల్లంతా పడి ఉన్నాయి.

ఆ పిట్ట రెక్కలాడిస్తూ అరిచింది. "అందరూ ఒకసారిటురండి. ఈ తెలివితక్కువ పెద్దమ్మ ఈ ఇంటిని ఓక్ పళ్ళతో నింపాలని చూసింది" ఆ పిట్టలన్నీ మబ్బు ముక్కలా కిందకు వాలాయి. ప్రతి పిట్టా ఇంటిలోపలకు చూడనూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వనూ. ఇట్లా చివరి పిట్ట వరకూ అదే పని చేశాయి.

ఒక గంటసేపు కప్పుమీద చెట్ల మీద కూర్చుని మనుషుల్లాగానే అదే విషయం గురించి మాట్లాడుకున్నాయి. ఆ పిట్టలకు హాస్యం తెలుసు. జ్ఞాపకశక్తి ఉంది. అమెరికా దేశం అంతటి నుంచీ మూడేళ్ళ పాటు వడ్రంగి పిట్టలు ఇక్కడకు వచ్చి ఆ కన్నాన్ని చూసి వెళ్ళాయి. మిగిలిన పక్షులు కూడా వచ్చాయనుకోండి. అవన్నీ ఈ విషయాన్ని గ్రహించి ఆనందించాయి గానీ నోవాస్కోటియా నుంచి మోసిమిటీకి వెళ్తూ వచ్చిన గుడ్లగూబకు మాత్రం ఇందులో ఏ విశేషమూ కన్పించలా. ఐతే మోసిమిటీలో కూడా ఆ గుడ్లగూబకు అసంతృప్తే కలిగి ఉంటుందనుకోండి.

❋

# ప్రేమికుల దినమా!

-డా॥ చల్లా రవికుమార్
9440507775

ఎస్సెమ్మెస్‌లూ, ఎస్సారెస్సులూ
సాఫ్ట్‌వేర్ సంగీతాల చుట్టూ
పరిభ్రమిస్తుందా ప్రేమ....?

నిఘాలు నిర్బంధాలు
నియమాలు, ఇతరుల నిర్ణయాల మధ్య
పరిమళిస్తుందా ప్రేమ....?



మనుషులు మనీపర్సులుగా
విలువలు ఏటీఎమ్ వాలెట్‌లుగా మారిన తర్వాత
మాటలు మాయమై
మనుషులు గాయాల సమూహమైనపుడు
ఊహలు, హృదయాలు ఎక్కడ వికసిస్తాయి
చెప్పు!

సంభాషణల కరచాలనాలు
కోల్పోయిన సందర్భాలు
సందేహాల మధ్య సంకోచిస్తున్న స్నేహాలు
బ్లాగులు, వాట్సప్‌లు, ఫేస్‌బుక్ బాక్సుల్లో
సమాధులుగా కట్టబడుతున్న చోట
సంబంధాలు ఆత్మ సంపర్కం కోల్పోయి
ఆత్మీయతలు ఆత్మహత్య చేసుకుంటున్న సమాజంలో
నిజంగా-
పరిమళిస్తుందా ప్రేమ!

దినాలు, వారాంతపు విరామాల్లో తప్ప
పరిఢవిల్లవా ప్రేమలు మన ప్రాణాల్లో ...
ఎండిన జీవితంలో
ఎగిరెళ్ళిన వసంతం కాదు కదా ప్రేమ
అందుకే-
కుచించుకుపోయిన ప్రేమలు
మళ్ళీ వ్యాకోచించాలి
అవి నిత్యజీవన పరిమళాలై
ప్రవహించాలి.

❋

---

# బాంధవ్యం

- స్వప్న
9493438363



అనుబంధాల ఆప్యాయతల్ని అపురూపంగా హృదయానికి
హత్తుకొని
బాంధవ్యాల బాధ్యతల్ని ఆనందంగా ఆహ్వానించి
నీ చుట్టూ అందమైన ప్రపంచాన్ని సంవత్సరాల
సహనంతో నిర్మించుకున్నావు...!
కష్టసుఖాలన్నీ నీవిగా చేసుకొని
అన్ని బంధాలనూ నీ ప్రేమతో ముడి వేసుకొని
నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో ఇమిడిపోయిన అనురాగం
అకస్మాత్తుగా నీ నిజాయితీని నిలదీసినపుడు
నీ చేతుల్లో కట్టుకున్న ఆశల సౌధం నేలకూలింది....!
ఒక్కొక్క అనుబంధం..... అపార్థాల సునామీలో....
నిస్సహాయంగా మునిగిపోయింది....!
నీ మౌనంలో దాగిన అంతులేని వేదన
కనిపించని కన్నీరై కరిగిపోయింది...!

ముక్కలైన నీ నమ్మకాల శకలాల మధ్య....
గాయపడిన ఆత్మాభిమానం తన ఉనికిని వెతుక్కుంటోంది...!
రక్తంతో ముడిపడ్డ అధికారం నిన్ను ప్రశ్నించినపుడు.....
అనుబంధాల ముడి తెంచుకోలేని ఏ బాధ్యతో....
నిన్ను తలవంచుకోమంది....!
చెదిరిన సాన్నిహిత్యాన్ని మళ్ళీ సరిదిద్దుకోమంది....!
అన్ని బాంధవ్యాలూ.... ఆనందాల హరివిల్లైన వేళ
నీలో దుఃఖానికీ... సంతోషానికీ స్పందించని శాంతిని
సృష్టించింది

❋

# ఎన్.గోపి ఇరవయ్యొకటవ కావ్యం 'ఆకాశంలో మట్టి'




- డా॥ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి
9494081896

**'In every age, the development of art is influenced by tasks set by society'**

**- G.L. Ermash**

ఎన్. గోపి గత నలభై ఏళ్ళలో (1976-2016) ఇరవయ్యొక్క కావ్యాలు ప్రచురించారు. ఇదొక చరిత్ర. ఇలాంటి చరిత్ర సృష్టించిన తెలుగు కవులు కొందరే. 1976-2009 మధ్య వచ్చిన 15 కావ్యాలను మూడు సంపుటాలుగా ప్రచురించారు. ఆ తర్వాత ఆరు కావ్యాలు ప్రచురించారు. వాటిలో ఆరవది "ఆకాశంలో మట్టి".

అరవై కవితల సంపుటి "ఆకాశంలో మట్టి". ఇవి 2014-15 రెండేళ్ళలో రాయబడినవి. ఒక్కటి మాత్రం ఇంకా ముందుంది.

సాహిత్య వస్తువు విషయంలో విధి నిషేధాలు అక్కరలేదని, ప్రాచీనకాలంలో ధనుంజయుడు చెప్పారు. ఆధునిక కాలంలో భావకవులు చెప్పారు. శ్రీశ్రీ చెప్పాడు. కవిత్వంలో వస్తు వైవిధ్యం ప్రదర్శించిన కవులు తెలుగులో అనేకులున్నారు. ఏ వస్తువును కవిత్వానికి స్వీకరించాలన్నది కవుల ఇష్టం. ఏ వస్తువును స్వీకరించినా దానిని కవితగా ఎలా మలిచారు? దానిని వర్తమానానికి ఎలా అన్వయించారు? దానిని ఎలా సామాజీకరించారు? అన్నది పాఠకులకు, విమర్శకులకు సంబంధించిన విషయం.

ఎన్. గోపి 'తంగెడుపూలు'తో కవిత్వ నడక ప్రారంభించారు. 'ఆకాశంలో మట్టి' దాకా ప్రస్థానం సాగించారు. ఈ 21 కావ్యాలలో గోపి గత యాభయ్యేళ్ళ ప్రపంచ పరిణామాలను కవిత్వీకరించే ప్రయత్నం చేస్తూ అనంతమైన వస్తు వైవిధ్యాన్ని ప్రదర్శించారు. ఒక దశలో ఒక విమర్శక సోదరుడు బొంత, తిన్నెలమీద కవిత్వం రాయడమేంటి అని అధిక్షేపించే ప్రయత్నం చేశారు. కవిత్వాన్ని నిరంతరం సానపెడుతూ ఉండాలని, అది ఎంత బాగా నలిగితే అంత బాగా మెరుస్తుందని వివరించారు. కవిత్వం రాసేదాకా కవి సొంతం. రాసేశాక అది సమాజ సంపద అని గోపికి మొదటినుంచి అవగాహన. ఈ విషయాన్ని 'అక్షర యాత్ర' కవితలోనూ చెప్పారు. గోపి ఎక్కడకు వెళ్ళినా చూచిన ప్రతి చిన్న విశేషాన్ని కవితగా మలుస్తారు. ఆయనకు కవిత్వం 'ఎందెందు వెదకి చూచినానందందే' అనిపిస్తుంది. ఆయన సందేశం కూడా అదే 'కవిత్వంతో తిరిగి రా'లో.

*నువ్వు ఏ ఊరు వెళ్తున్నావని అడగను*
*వచ్చేటప్పుడు మాత్రం*
*ఓ పద్యం పట్టుకురా...*
*ఎప్పుడైనా రా...*
*కనీసం ఒక పద్యమైనా తీసుకురా..*

9

కవిత్వం రాయడానికి అల్లసాని పెద్దన కోరుకున్న వాతావరణం అక్కరలేదని దీనర్థం.

*"అహో! చేతులముందు*
*ఈ మహాకావ్యాలెంత!"*
*ఆకలిని మించిన కవిత్వం*
*నాకిప్పటికీ తోచదు"*

వంటి స్థలాలలో గోపి కవిత్వానికి జీవితం తర్వాత స్థానమిస్తున్నా, కవిత్వం మీద ఆయనకు అపారమైన గౌరవముంది. ఆయనను ఆయన కవిత్వం నుంచి విడదీసి చూడడం కష్టం. కవిత్వం ఎలా రూపొందుతుందో 'వెలిగే వాక్యం'లో చిత్రించారు గోపి. ఇది కవిత్వం రూపొందే క్రమాన్ని వాస్తవికంగా చెప్పింది.

*కవి యెదలో*
*ఓ పద్యం రొద చేస్తుంది గాని*
*అది రాజ్యాంగానికెప్పుడూ అర్థంకాదు*

అనడం కవిత్వం నిర్వహించే ప్రతిపక్ష పాత్రను నిర్వచించడమే.

*మట్టిమీద*
*సిమెంటు చర్మాన్ని కప్పి*
*అదే అభివృద్ధి అంటే ఎలా?*

గత పాతికేళ్ళుగా భారతీయ పాలకులు ప్రచారం చేస్తున్న అభివృద్ధి నమూనాపై కవి ఎక్కుపెట్టిన ప్రశ్నా బాణం ఇది. 'బడ్జెట్ విన్యాసాలు' కవిత గోపి రాజకీయ దృక్పథానికి ప్రతీక. సామాన్యుల బడుగుల పీడితులకు స్వర్గం సృష్టించడానికే బడ్జెట్ రూపకల్పన చేసినట్లు చెప్పని ఆర్థికమంత్రి ఉండరు. కాని ఆ సామాన్యులు ఆ బడుగులు ఆ పీడితులు ఆ బడ్జెట్ బరువు కింద నలిగిపోతూనే ఉంటారు. ఈ బూటకపు అభివృద్ధిమీద కవి కోపమే ఈ కవిత...

*'పార్లమెంటులో మంత్రి*
*బడ్జెట్ వివరాలు చదువుతుండగానే*
*అతడు ప్రాణాలు విడిచాడు'*

గోపి దశాబ్దాలుగా హైదరాబాద్ నగరంలో బ్రతుకుతున్నా ఆయనకు నగర సంస్కృతి పట్ల ఒక అసౌకర్య భావన, తాను బతికి వదిలి వచ్చేసిన పల్లె జీవితం పట్ల వదలని వ్యామోహం – ఈ రెండూ ఆయన కావ్యాల నిండా పరుచుకొని ఉంటుంది. 'ఆకాశంలో మట్టి' కూడా ఈ ధోరణికి తాజా ఉదాహరణ. నగరంలో నివసిస్తున్న వాళ్ళకే అర్థం కానంతగా నగరాలు మారిపోతున్నాయి. మానవ సంబంధాలలోనూ


డా॥ ఎన్. గోపి

మార్పు అనూహ్యంగా వచ్చేస్తున్నది. ఈ పరిణామాన్ని చూచి కవి 'నగరం నాకొద్దూ' అంటున్నాడు.

*"పల్లెకు దారి జెప్తారా*
*మరచిపోయాను"*

అని అడుగుతున్నాడు.

*రోడ్లమీద ట్రాఫిక్*
*సంక్లిష్ట వాక్యంలా ఉంటుంది*

గొప్ప కవిత్వ వాక్యమిది. *'నగరం ఒక వచనం'* అన్నారు గోపి.

ఎన్. గోపిది శ్రామిక కుటుంబం. ఉత్పత్తివర్గం. ఆయన నగరం చేరి శ్రమకు దూరమైనా, తన వర్గ శ్రామిక స్పృహను ఏనాడూ వదులుకోలేదు. "మట్టి మట్టిని ప్రేమిస్తుంది" అని తన శ్రామిక సంస్కృతిని చాటుకున్నారు. శ్రమకు సాధనాలు చేతులు. వ్యవసాయానికి గాని, వడ్రంగానికి గాని, చేనేతకుగాని, కుమ్మరికిగాని, దేనికైనా శ్రామిక సాధనం చేయి. గోపి చేతుల శ్రమ కవితాత్మకంగా కీర్తించారు.

**చేతులు**
**పొట్టి తోలు కట్టెలు కావు**
**అగ్గువగా అమ్ముడౌతున్నంత మాత్రాన**
**ఎవరికీ గులాంగిరి చెయ్యవు.**

బాల కార్మిక వ్యవస్థమీద 'నెత్తుటి దారి'లో విలువైన వ్యాఖ్యలు చేశారు.
చెప్పులు కుట్టే చిన్న పిల్లవాడిని చూచి, బాలలు కష్టపడే వ్యవస్థ ప్రపంచమంతా ఉందనే దృష్టితో అధిక్షేపించారు.

*పసితనానికి*
*ఒక దేశమంటూ ఉండదు*
*అట్లనే దుర్మార్గానికి కూడా*

ఎన్. గోపి కవిత్వంలో మరొక ముఖ్యమైన వస్తువు స్మృతి. ఇది ఒక మానవీయ దృష్టికోణం. 'ముసురులో ముసలి'తో మొదలుబెట్టి అనేక స్మృతి కవితలు రాశారు. ఈ కావ్యంలో 'ఒక్కడే' అన్నది స్మృతి కవిత. పర్వతారోహణలో ప్రాణాలు కోల్పోయిన మల్లి మస్తాన్‌బాబు స్మృతిలో రాసిన కవిత ఇది.

*మట్టి ఎత్తును*
*ఆకాశం దాకా పెంచిన*
*విశ్వ మానవుడు*

*తెలుగు బిడ్డ*

అని కీర్తించాడు.

'కాదేదీ కవితకనర్హం' అన్నది ఆధునిక తెలుగు కవితకు అధికారిక అలంకార సిద్ధాంతం కదా! రొట్టెమీద రాసినా, బొంతమీద రాసినా, చినిగిన గుడ్డల కుట్టు పనిమీద రాసినా, కవి ఆ వస్తువు ద్వారా మనకందించిన జీవన సారం ఏమిటన్నది ప్రధానం. 'ఆకాశంలో మట్టి' కావ్యంలోను, పిల్లి, గద్ద, నిద్ర, అద్దం, జేబువంటి వస్తువులమీద కవితలు రాశారు. దీనికి అభ్యంతరం చెప్పక్కరలేదు.

*కవి అలిసిపోవచ్చు*

*కవిత అలసిపోదు*

అన్నారు గోపి. 'పురివిప్పిన ఊపిరి'లో. కానీ కవిగా గోపి అలసిపోలేదు. కాలాన్ని నిద్రపోనివ్వని కవి గోపి. ఆయన కవిత్వంలో వస్తు వైవిధ్యం అనంతం అనుకున్నాం. అయితే ఆయన వస్తు వైవిధ్యాన్నంతా మనం క్లుప్తీకరిస్తే ఆయన రెండే వస్తువుల గురించి కవిత్వం రాసినట్లు అర్థమౌతుంది. అవి 1. కవిత్వం 2. జీవితం. కవిత్వం పట్ల గోపికి ఎనలేని గౌరవముంది. అదే సమయంలో జీవితం పట్ల ఎల్లలు లేని ప్రేమ ఉంది. కవిత్వం గొప్పతనాన్ని ఏమాత్రం తక్కువచేసి మాట్లాడకుండా జీవితం కవిత్వం కన్నా గొప్పది అనే అవగాహన ఆయనకుంది. ఇది శాస్త్రీయమైన అవగాహన.

ఎన్. గోపి కవిత్వంలో కవిత్వమే ఒక ప్రధాన వస్తువు అనుకున్నాం. ఆయన ఇప్పటిదాకా రాసింది దాదాపు రెండు వేల పేజీల కవిత్వం. కవిత్వాన్ని గురించి కనీసం 200 పుటల కవిత్వం రాసి ఉంటారు. ఇదొక పెద్ద సంపుటమంత. ప్రత్యేకంగా పరిశోధన చేయదగినంత. 'ఆకాశంలో మట్టి' దాదాపు ఎనిమిది కవితలు కవిత్వం మీదే రాశారు. ఇతర కవితలలోనూ కవిత్వ ప్రసక్తి వస్తూ ఉంటుంది. 'ఒరిపిడి' కవితలో కవిత్వాన్ని ఒక సూదంటురాయి. ఒక ఆకురాయి, ఒక విసుర్రాయి అని ఉపమించారు. వివరించారు. కవిత్వం ఎక్కడో దాగి ఉన్న భావాలను ఆకర్షిస్తుందని అలాగే విశాఖను అతలాకుతలం చేసిన హుద్‌హుద్ తుఫానూ, నేపాల్ భూకంపాలమీద కూడా స్ఫూర్త్యంకంగా కవితలు రాశారు గోపి. రాళ్ళబండి కవితా ప్రసాద్‌ను స్మరించుకుంటూ...

*అచిరకాలంలోనే*

*అంబరమంటిన సాధన నీది*

అంటూనే దానిని భావవాద పద్ధతిలో "విధికే కన్ను కుట్టిందా" అనడానికి కవి సంకోచించలేదు. దాశరథి రంగాచార్య మరణం సందర్భంగా "మాక్సిం గోర్కీ మరోసారి మరణించాడు" అని నిర్వచించాడు.

ఇన్ని సామాజికాంశాల మీద కవిత్వం రాసిన గోపి ఇంట్లో పేపర్లు అమ్మడం మీద, ఆధునిక గృహం మీద, సొంతిల్లు మీద, ఇంటి కప్పు మీద కూడా సామాజిక దృక్పథంతోనే కవితలు రాశారు. పిల్లిని తల్లిగా భావించగల హృదయం ఆయనది. అద్దాన్ని పద్యంగా భావించగల భావుకత ఆయనది.

*కవిత్వం వచనంలా*
*వచనం కవిత్వంలా భ్రమగొల్పుతుంది*
*ఇవాళ నగరం వచనమైతే*
*దానిలో నలిగే జీవితం కవిత్వం*

అని సంక్లిష్ట జీవితాన్ని సాహితీ పరిసరాలతో అభివ్యక్తం చేయగల నేర్పు గోపిది. సముద్రంలో 'ఘనీభవించిన నీటిబొట్టులా శ్రీలంక" అని ఉపమించే సృజనాత్మకత ఆయనది.

*ఆమె ప్రశ్నించేది దేవున్నే కావచ్చుగాని*
*నాకుమాత్రం ఆమె*
*రాజ్యాంగాన్ని నిలదీస్తున్నట్టుగా ఉంది*

అనే రాజకీయ కంఠస్వరం ఆయనది.

*ఈ దేశంలో అగ్గువగా*
*అమ్ముడయ్యేది చేతులే*

అనగలిగిన శ్రామిక పక్షపాతం గోపిది.

అనేక ఉద్రేకాల నడుమ మనుగడ సాగిస్తున్న సమాజంలో రచయితలు వాటికి అతీతంగా ఉండడం సాధ్యంకాదు. అనేక భావజాలాలు సమాజాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్న సమయంలో రచయితలు వాటిని విస్మరించి రాయడం సాధ్యంకాదు. గోపి కూడా అంతే. ఆయనలో సమకాలీనత అంతస్సూత్రంగా ఉంటుంది. వ్యక్తిగత విశ్వాసాలు కొన్ని ఉన్నాయి. ఆయన ప్రధాన స్రవంతి భావజాలాలను విస్మరించే భావవాది కాదు. గ్రామాన్ని వదలి నగరాలలో జీవిస్తున్నా, నేలను దాటి విమానాలలో విహరిస్తున్నా, కష్టాలు దాటి జరుగుబాటు స్థితిలోకి ప్రవేశించినా తన మూలాన్ని మరచిపోక పోవడమే "ఆకాశంలో మట్టి".

**"Art is a powerful and unique social instrument for the integrated formation of the personality"**

**- S.Kh. Rappoport**

❋

## జాతి

- మంత్రి కృష్ణమోహన్
9441028186



మొన్న
స్వాతంత్ర్యోద్యమ కాలాన
జాతి
దేశానికి పర్యాయమైంది

నిన్న
భాషా ప్రయుక్తాల సమయాన
జాతి
రాష్ట్రానికి పరిమితమయ్యింది.

ఇవాళ
ఎవరి డిమాండ్ల గురించి వాళ్ళు
జాతి
కులవాచికమయ్యింది

రేపటిరోజు
ఈ జాతి
ఏమవుతుందో?

జాతి అంటే
మానవజాతి కూడానని
మరచిపోయినట్లున్నాం.

---

## ఆఖరి పోరాటం

- జి. తిరుపతిరావు
94 40 30 24 84



విడిచిన చొక్కా జేబులో చూశాను ..... లేవు.?
సొరుగులో చూశాను ..... లేవు.?
అద్దం వెనకాల చూశాను ..... లేవు.?
పాత డైరీ లో... పాత పుస్తకాల్లో ....లేవు...!?

ఇక్కడ .... ఈ పేపర్ క్రింద ... ఉంటాయా ... ?
.... చూద్దాం..!
దొరికితే బావుణ్ను ...!! ప్చ్ .... లేవు.
చెక్క బీరువాలో ...
చీరల క్రింద?! ... ఉంటాయా ?
నాకు తెలీకుండా... ఏమైనా దాచిందా?..?
ఛ... ఛ .... తను అటువంటిది కాదు.
"నాన్నా ....సింగిల్ రూల్ కావాలి..."

"అలాగే నమ్మా.."

పోనీ నాకు ఇవ్వవలసిన వాళ్ళున్నారా ?
జగన్నాథం, సూరిగాడు, రమేశ్,
ప్యూన్ పాపారావ్...
ఊహు .. ఇవ్వక్కర్లేదు.

"ఏవండీ.... సరుకులు...
"తెస్తాను"

-2-

వెతుకుతున్నాను ....ఊరెళ్ళొచ్చిన పెట్టె..
తన హ్యాండ్ బ్యాగ్ ... ఆలోచిస్తున్నాను,
ఏమైనా రావలసినవి ఉన్నాయా ?
నో.. నో.. లేవు ....
ఎవర్నైనా అడిగితే ...
ఎన్నిసార్లని అడుగుతాను.
పోనీ .. మళ్ళీ అడిగితే ,
వద్దు ఎన్ని సార్లని...

వెతుకుతున్నాను,
ఆలోచిస్తున్నాను....
వెతుకుతున్నాను....
నెలాఖరు కదా !!

విశ్వంభర.... , మైదానం....,
త్వమేవాహమ్... అంతర్ముఖం .....
మహాప్రస్థానం .....
వెతుకుతున్నాను....

## తెలుగు కథలో

# కుటుంబ సాంప్రదాయాలు - హక్కుల ఉల్లంఘన

- డా.కె.సుభాషిణి



*స్త్రీల హక్కులపట్ల జడత్వంతో, నామ మాత్రపు స్పృహ కూడా లేని భారతదేశపు సమాజాన్ని, పాశ్చాత్యదేశాల ప్రభావంతో మొదలయిన స్త్రీవాద వుద్యమాలు కాస్త కదలికను తీసుకొచ్చాయి. ఈ ప్రభావం తెలుగు కథలో చాలా బలంగా కనిపిస్తుంది. ఇంటిపని, బయట పని, ఆస్తిహక్కు, వరకట్నం, అత్యాచారాలు, గృహహింస మొదలయిన విషయాల పైన వాస్తవిక ధోరణిలో కథలను రాస్తూ స్త్రీలను చైతన్యపరచటానికి కావలసిన భూమికను ఏర్పాటు చేసి, సమాజంలో ఆరోగ్యకరమైన చర్చలను చేయటంలో తెలుగు కథ పాత్రను విస్మరించలేము.*

"దోపిడికి ఆడ మగ తేడా లేదర్రోయ్. ఆడవారిపై మగవారి పెత్తనం అదనంగా వుందర్రోయ్"

ఒక వర్గాన్ని అణగదొక్కి , అధికారం చెలాయించటమే పెత్తనం . ఇది హక్కుల ఉల్లంఘనకు పెద్ద ఎత్తున దారి తీస్తుంది. పెత్తనానికి లోబడి , మానవ హక్కులను అనుభవించే అవకాశాలు లేకుండా అవమానాలతో సమాజంలో బ్రతుకులు వెళ్లదీస్తున్న వారిలో అధిక భాగం మహిళలే. తల్లిదండ్రుల పెంపకాలలోని లోపాలు బాలికలను మానసిక, శారీరక బలహీనులుగా తయారు చేస్తోంది. కుటుంబం, సమాజం తాము నిర్వచించిన పద్ధతులలోనే మహిళలు నడుచుకోవాలని శాసిస్తుంది. సాంప్రదాయాలు , కట్టుబాట్ల పేరిట కుటుంబం స్త్రీకి ముందుకాళ్ల బంధం వేసి కనిపించని ఆంక్షలను విధించి తన పబ్బం గడుపుకుంటోంది. స్త్రీలను తమ చెప్పు చేతల్లో వుంచుకోటానికి అవసరమయినప్పుడు మత గ్రంథాలను ప్రస్తావించటం అనాదికాలం నుండి జరుగుతున్నది. కోరికలు, ఆకాంక్షలు, ఆశయాలను పణంగా పెట్టీ త్యాగం, బాధ్యత పేరిట మహిళలు స్వీయ పతివ్రతధర్మాలకు లోనయ్యి కుటుంబమే సర్వస్వంగా భావించారు. ఈ అధునిక, సాంకేతిక కాలంలో ఈ ఆంక్షల వలన మహిళలు ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. తమకు వున్న హక్కులు ఏమిటో కూడా తెలుసుకోలేక చాలా కాలం పాటు ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం అన్న మాటలే మరచిపోయి స్వేచ్ఛ, హక్కులకు దూరంగా వుండిపోయారు.

స్త్రీల హక్కులపట్ల జడత్వంతో, నామ మాత్రపు స్పృహ కూడా లేని భారతదేశపు సమాజాన్ని, పాశ్చాత్యదేశాల ప్రభావంతో మొదలయిన స్త్రీవాద వుద్యమాలు కాస్త కదలికను తీసుకొచ్చాయి. ఈ ప్రభావం తెలుగు కథలో చాలా బలంగా కనిపిస్తుంది. ఇంటిపని, బయట పని, ఆస్తిహక్కు , వరకట్నం, అత్యాచారాలు, గృహహింస మొదలయిన విషయాల పైన వాస్తవిక ధోరణిలో కథలను రాస్తూ స్త్రీలను చైతన్యపరచటానికి కావలసిన భూమికను ఏర్పాటు చేసి, సమాజంలో ఆరోగ్యకరమైన చర్చలను చేయటంలో తెలుగు కథ పాత్రను విస్మరించలేము.

స్త్రీలకు తమకు వున్న హక్కులు ఏమిటో, లేనివి ఏమిటో, సాధించుకోవాలసినవి ఏమిటో కొన్ని కథలను చూస్తే అర్థమవుతుంది. మహిళల కొరకు ప్రత్యేక చట్టాలు

రూపొందిస్తున్నట్టు ప్రభుత్వాలు ప్రకటిస్తుంటాయి. స్త్రీలపైన హక్కుల ఉల్లంఘన జరిగితే కఠినంగా శిక్షిస్తాం అని ప్రభుత్వాలు హెచ్చరిస్తుంటాయి. కాని ప్రభుత్వాలు చేసే చట్టాలలో వున్న లొసుగుల వలన స్త్రీలు తమ హక్కులను సంపూర్ణంగా అనుభవించలేక నలిగిపోతున్నారు. అయితే కేవలం చట్టాల ద్వారా మాత్రమే స్త్రీల పైన అమలయ్యే వివక్షత పోదనీ , కుటుంబాలూ, సమాజం స్త్రీని రెండో పౌరురాలిగా చూసే ఆలోచన విధానంలో సమూల మార్పులు వస్తే తప్ప స్త్రీ పురుష సమానత్వం ఏర్పడదని గత ఏడు దశాబ్దాలుగా రచయితలు తమ అభిప్రాయాలను తెలుగు కథలల్లో చెప్తూ వచ్చారు.

> ***ఎప్పటికైనా సమాజం, కుటుంబాలలో కూడా అలాంటి మార్పు రావాలన్న గొప్ప ఆశయంతో రాసిన పెద్ద కథ యిది.***

వారంరోజులపాటు వంచిన నడుము ఎత్తకుండా యింట్లో పని చేస్తున్న స్త్రీలకు కనీసం ఆదివారం రోజైనా యింట్లో విశ్రాంతిని కల్పించాలి అన్న చట్టాన్ని తీసుకురావాలి అని ముప్పై సంవత్సరాల క్రితం పార్లమెంటులో ఒక ప్రతిపాదన వచ్చింది. ఆ చట్టం ఎంత లోప భూయిష్టమైనదో , మహిళలకు అది ఏమేరకు ప్రయోజనం చేకూరుస్తుందో రంగనాయకమ్మ రాసిన “అమ్మకు ఆదివారం లేదా ?” కథ వివరిస్తుంది. వ్యంగ్యాత్మకంగా నడిచిన ఈ కథ పాఠకులను ఆకర్షిస్తుంది. ఆలోచింపచేస్తుంది. కేవలం ఇంటి చాకిరికే పరిమితమైన పెద్ద కోడలు అరుణ , వుద్యోగంతో పాటు, ఇంటి పని కూడా చేసే చిన్న కోడలు కమల ఒకనొక ఆదివారం రోజు, ప్రభుత్వం చేసిన చట్టం ప్రకారం “ఆదివారం మేము పని చెయ్యం. ఈ రోజు పూర్తిగా మాకు విశ్రాంతి...మగవాళ్లే ఇంటిపని చెయ్యాలి..” అని ప్రకటిస్తారు. అయితే వారి భర్తలు ప్రసాద్, వాసు ఆడవాళ్లకు సహకరించరు. ప్రభుత్వ చట్టాన్ని ఏమాత్రం లెక్క చెయ్యరు. మేము చెయ్యం ఎవరు వచ్చి మాతో పని చేయిస్తారో రమ్మను అని సవాల్ విసురుతారు. వీళ్ల తమ్ముడు వేణు మాత్రం ఆధునికంగా ఆలోచిస్తూ , ఆడ పని , మగ పని అన్న మాటలకు తావులేకుండా యింట్లో అన్ని పనులు చేస్తూ వదినలకు స్త్రీల హక్కుల గురించి చెప్తూవుంటాడు. అన్నల పక్షం వహించకుండా వదినల పక్షం వహించి తిరగబడమని చెప్తూ , వదినల ఆలోచనల్లో వున్న లోపాలను ఎత్తి చూపిస్తాడు.

“ఇంటి పని నుంచి వారానికి ఒక్కరోజు సెలవు అంటే , మిగతా ఆరు రోజులూ ఇంటి పని నేనే చేస్తాను , అది నా బాధ్యతే అని ఒప్పుకోడం కాదా” అని పెద్ద వదినను నిలదీస్తూ, వుద్యోగం చేయని అరుణ హక్కుకు వుద్యోగం చేసే కమల హక్కుకు వున్నతేడాను గురించి అరుణకు వివరిస్తాడు

“చిన్నన్నయ్యని ఇంటి పనులు రోజూ చెయ్యాలని డిమాండ్ చెయ్యాడానికి కమల వదినకు పూర్తి హక్కు వుంది. అలాంటి హక్కు నీకు అంత పూర్తిగా ఉండదు. తనకు ఏ హక్కు ఉందో చిన్న వదినకు తెలీదు. నీకు ఏ హక్కు లేదో నీకూ తెలీదు... .ఆడ మగా సమానం అవాలంటే ఏకైక సూత్రం ఏమిటో తెలుసా?

ఇద్దరికీ – బైటి పనీ, ఇద్దరికీ – ఇంటి పనీ! ..... బైటి పనీ , ఇంటిపనీ – రెండూ కలిసినదే మనుషుల జీవితం ! మనుషులుగా వుండదలుచుకున్న వాళ్ళు , ఆ రెండు పనులను తమ బాధ్యతగా చేసుకోవాలి. ఆ బాధ్యత – ఈ రోజూ , ఆ రోజూ అని కాదు. ఈ వారం ఆ వారం – అని కాదు. అన్ని రోజూలు ఒక్కలాగే , అన్ని వారాలూ ఒక్కలాగే వుండాలి. “ ఉపన్యాస ధోరణిలో చెప్తూ సమస్యను అర్థం చేసుకున్న తర్వాతనే పోరాటాలు చేయాలని హెచ్చరిస్తాడు.

వేణు ఉపన్యాస ప్రభావం వదినల మీదనే కాకుండా వేణు చెల్లెలు రేఖ మీద కూడా పడ్తుంది. చదువు పూర్తి కాకనే, వుద్యోగం లేకుండానే పెండ్లి చూపులకు సిద్ధపడిన రేఖ తన నిర్ణయాన్ని మార్చుకుంటుంది . అందుకు కారణం తెలుపుతూ

“తనను తాను పోషించుకోలేని మనిషి జీవచ్ఛవంతో సమానం అమ్మా! ఇక ఆ మనిషి స్వతంత్రం గురించి ఆలోచించడానికేంవుంటుంది ?’ఆడా మగా సమానం ’ అని ఆలోచించే మనిషిని తప్పితే నేను చేసుకోను....”.

కథ పూర్తి అయ్యేసరికి కుటుంబంలోని ఆడా మగా అందరి అభిప్రాయాలలో మార్పు వస్తుంది . ఒక్క పూటలో మనుషులల్లో మార్పు వస్తుందా అన్న అనుమానం కథ చదివిన తర్వాత పాఠకులకు కలగవచ్చు . కానీ ఎప్పటికైనా సమాజం, కుటుంబాలలో కూడా అలాంటి మార్పు రావాలన్న గొప్ప ఆశయంతో రాసిన పెద్ద కథ యిది.

ఇంటా , బయటా స్త్రీలు చేసే చాకిరికి అంతే వుండదు . అయినప్పటికి ఆర్థికంగా పరాధీనంగానే బ్రతుకుతున్నారు.

వీరి శ్రమకు ఎలాంటి గుర్తింపు లేదు. జాతీయ స్థూల ఆదాయంలో స్త్రీల వాటా చాలా తక్కువగా వుంటోంది. భూములమీద, ఉత్పత్తి సాధనాల మీదా స్త్రీలకు హక్కు లేకపోవటమే యిందుకు కారణం. సమాజంలో సహజంగా భూములను కొడుకులకు పంచటమే ఎక్కువగా కనిపిస్తుంది. కూతుర్లకు వరకట్నం రూపంలో ధనాన్ని, బంగారాన్ని ముట్టచెప్పటం జరుగుతుంది. అయితే డబ్బు రూపంలో యివ్వబడే వరకట్నం మీద ఆడపిల్లకు ఎలాంటి హక్కు వుండదు. యిక బంగారం ఉత్పత్తి సాధనం కాదు. మహా అయితే అమ్మితే పెట్టుబడిగా పనికి వస్తుంది. వ్యవసాయ భూములపైన స్త్రీకి హక్కులు వుండవు కానీ , మగవాళ్లకంటే ఎక్కువుగా స్త్రీలే వ్యవసాయ పనులు చేస్తుంటారు. స్త్రీని పరాధీనగా వుంచాలంటే అర్థికంగా ఆమె స్వతంత్ర అయి వుండకూడదు అన్నది ఈ పురుషాధిపత్య సమాజం యొక్క దృఢ నిర్ణయం. కట్నం యిచ్చి పెండ్లి చేసి పంపితే తమ బాధ్యత తీరిపోతుంది ఆ తర్వాత ఆమె బాగోగులు భర్త చూసుకుంటాడు అని తల్లిదండ్రులు భావిస్తుంటారు. యిది ఎంతటి తప్పు అభిప్రాయమో, అది స్త్రీగా తనకు ఎంత అవమానమో తెలియచేసి తన హక్కును కాపాడుకోటానికి సిద్ధపడిన మాధవిని " నూరేళ్ళ నిశ్శబ్దం " కథలో ఓల్గా చిత్రించారు.

అమెరికా సంబంధం అన్న మురిపెంతో పెండ్లికొడుకును చూడకుండానే, పది లక్షల కట్నంతో కూతురు మాధవికి సంబంధం కుదురుస్తాడు చలపతి రావు. అందుకు వంత పాడుతుంది భార్య రామలక్ష్మి. ఎక్కడెక్కడో వుద్యోగాలు చేసుకునే కొడుకులు కోడళ్లు , కూతుర్లు అల్లుళ్ళు అందరూ వస్తారు.. ఎమ్.ఏ చదువుతున్న పెండ్లికూతురు తప్ప. పెండ్లి జరిగే నాలుగు రోజులు ఏఏ చీరలు కొనుక్కోవాలో , ఎలాంటి నగలు పెట్టుకోవాలో అనే హడావిడిలో మాధవి అక్కలు , వదినలు పడిపోతారు. పరీక్షలు రాసి యింటికి వచ్చిన మాధవి యిప్పుడు పెండ్లి చేసుకునే వుద్దేశ్యం తనకు లేదని తనకు ప్రస్తుతం వ్యవసాయం చేయటం పైన ఆసక్తి వుందని చెబుతుంది. అంతేకాకుండా కట్నం కింద యిచ్చే పది లక్షలు తనకే యిస్తే భూమి కొంటానని చెబుతుంది. అందరూ మాధవి నిర్ణయాన్ని వ్యతిరేకిస్తారు. కావాలంటే పెండ్లి అయ్యాక

***నలభై సంవత్సరాలుగా కొడుకు యింట్లోనే వుంటూ ఎవ్వరితోనూ నోరు విప్పి మాట్లాడని మాధవి నాయనమ్మ వెంకాయమ్మ, పోరాటానికి సిద్ధపడిన మనుమరాలికి అండగా నిలుస్తుంది .***

మొగుడు ఒప్పుకుంటే అప్పుడు చేద్దువుగానీలే అని తేలికగా మాట్లాడుతారు. అయితే మాధవి యింట్లో వాళ్ల బలవంతానికి లొంగక అన్నలకు, అక్కలకు యిచ్చినట్టే తనకు డబ్బులు కావాల్సిందేనని పట్టుబడుతుంది. వరకట్నంగా యివ్వడానికి సిద్ధమే కానీ కూతురు వ్యవసాయం చేయటానికీ, భూమి కొనటానికి కూతురుకు డబ్బు యివ్వటానికి ఆ తండ్రికి మనసు రాదు. స్వతంత్ర భావాలతో ఏదో సాధించాలనే మాధవికి కుటుంబ ధోరణి కోపం తెప్పిస్తుంది. చివరి అస్త్రంగా

" ఆస్తిలో నా వాటా నాకు రావాలి " అని తన హక్కును ప్రకటించుకుంటుంది .

" నా స్వార్జితం. నా యిష్టం.....నీకు పైసా దక్కకుండా విల్లు రాసిన తరువాత గాని నేను చావను." అని కేవలం కూతురు మీద కోపం వెళ్ళగక్కటం ఒక్కటే ఇక్కడ కనిపించదు. ఆడపిల్లలంటే తల్లిదండ్రుల మాటను నోరెత్తకుండా వినాలని వారు చూపించిన సంబంధాన్ని ఒప్పుకొని పెండ్లిచేసుకొని , మొగుడికి, పిల్లలకు వండిపెట్టీ, పుట్టింటికి, అత్తింటికి మంచిపెరు తెచ్చిపెట్టాలని కోరుకునే భారతీయ సమాజపు సగటు తల్లిదండ్రులకు ప్రతీక చలపతిరావు. ఈ విషయాలు యథాతతంగా జరగకూడదనేదే రచయిత్రి వుద్దేశ్యం. నలభై సంవత్సరాలుగా కొడుకు యింట్లోనే వుంటూ ఎవ్వరితోనూ నోరు విప్పి మాట్లాడని మాధవి నాయనమ్మ వెంకాయమ్మ, పోరాటానికి సిద్ధపడిన మనుమరాలికి అండగా నిలుస్తుంది. తల్లి అప్పమ్మ ఎంతో కష్టపడి వ్యవసాయం చేసి రెండెకరాల భూమిని పది ఏకరాలు చేసి కూతురు వెంకాయమ్మకు యిస్తుంది. అయితే వెంకాయమ్మ భర్త సోమరితనంతో, విలాసాలలో మునిగితేలి భూమిని అమ్ముకుంటాడు. చివరకు రెండు ఎకరాల భూమినీ , ఒక కొడుకును వెంకాయమ్మకు మిగిల్చి చనిపోతాడు . వ్యాపారం చేసి డబ్బు సంపాదించాలని ఆ రెండు ఏకరాల భూమినీ , ఇంటినీ కొడుకు చలపతిరావు బలవంతంగా తల్లి చేత అమ్మిస్తాడు. ఆ విధంగా భూమి మీద తన హక్కులను కోల్పోయిన వెంకాయమ్మ తన మనుమరాలి హక్కును కాపాడేందుకు కొడుకుతో పోరాటానికి సిద్ధమవుతుంది. నలభై సంవత్సరాల కింద మూతబడిన నోరు అప్పుడు తెరిచి

“ ఆడదాన్ని భూమికి దూరం చేసి మీరు మేడలు కట్టారు. నాకీ మేడలో సుకం లేదు....నా రెండెకరాల డబ్బు, ఇల్లమ్ముకున్న డబ్బు రూపాయి వడ్డీ లెక్కగట్టి యియ్యి...యియ్యకపోతే నేను నా మనవరాలూ కోర్టెక్కుతాం...” తన తిరుగులేని నిర్ణయాన్ని ప్రకటిస్తుంది.

కథ అసలు సారాంశం యిదే. మగవారికి అవమానం అయ్యేది ఆడవారికి గౌరవం ఎలా అవుతుంది? ఆనందం ఎలా కలుగుతుంది అన్న ప్రశ్నలు ఈ కథను చదివాకా పాఠకుల మనసులలో కలుగుతాయి.

స్త్రీలతో వ్యవసాయ పనులు చేయించుకుంటూనే స్త్రీకి భూమి మీద హక్కు లేకుండా చేసే కుట్రలకు బలికాకుండా భూమిపైన హక్కు సాధించుకోవాలని చెప్పిన కథ యిది.

స్త్రీకి వివాహమే అంతిమ లక్ష్యమని చదువులు ఆపేసి అయినా సరే ఆడపిల్లకు పెండ్లి చెయ్యాలని తల్లి దండ్రులు తలబెడితే అందుకు ఎలాంటి సంకోచాలు లేకుండా పెండ్లికి సిద్ధమయ్యే అమ్మాయిల పైన ఓల్గా కొరడా ఝులిపించిన కథ “ ఓ పెళ్ళి కథ “. చదువు అపేయించి చెల్లెలు దీప్తికి పెండ్లి సంబంధం కుదిర్చిన తల్లిదండ్రులపై కోపం వస్తుంది ప్రశాంత్ కు. తను కూడా చదువు మానేసి పెండ్లి చేసుకుంటానని యింట్లో ప్రకటిస్తాడు ప్రశాంత్.

“ తా దూర కంత లేదు మెడకో డోలా “ అని ఛీ..ఛీ...చా...చా అంటారు. “ నా పెండ్లామే నన్ను పోషిస్తుంది “ అన్న ప్రశాంత్ మాటలకు సిగ్గు లేదూ చదువు మానేసి పెండ్లి అంటావా అని చివాట్లు పెడతారు . ఏ సమాధానం కోసం ప్రశాంత్ ఎదురు చూశాడో సరిగ్గా అదే తల్లిదండ్రుల నుండి వచ్చింది.

“ దీప్తి చదువు ఒక్క మాటతో ఆపేసిన మీకు నే చదువాపడం ఎందుకిష్టంలేదు. దీప్తి మొగుడికి చాకిరి చేసి తిండి సంపాదించుకోవడం ఇష్టమవుతోందిగానీ నేను నా పెళ్ళానికి చాకిరి చేసి తిండి సంపాదించుకుంటానంటే సహించలేకపోతున్నారెందుకు ? “ .

కథ అసలు సారాంశం యిదే. మగవారికి అవమానం అయ్యేది ఆడవారికి గౌరవం ఎలా అవుతుంది? ఆనందం ఎలా కలుగుతుంది అన్న ప్రశ్నలు ఈ కథను చదివాకా పాఠకుల మనసులలో కలుగుతాయి.

స్త్రీలకు అవమానం కలిగించేవి , వారి ఆత్మగౌరవానికి భంగం వాటిల్లే ఏ చర్య అయినా , అది హక్కుల ఉల్లంఘన కిందకే వస్తుంది. వారి యిష్టానికి వ్యతిరేకంగా మానసికంగా కానీ , శారీరకంగా కానీ నష్టాలు కలగచేయటం స్త్రీల హక్కులను కాలరాయటమే అవుతుంది. స్త్రీ ప్రతిఘటించినప్పటికి , అసహ్యించుకున్నప్పటికి “ గాంధీగారి రాజ్యంలో గజానికొక గాంధారి కొడుకులు “ చేసే లైంగిక దాడులు కొల్లలు. ఈ అత్యాచారాలకు బలి అయిన ఆడవారిపై అండగా వుండాల్సిన సమాజం మౌనంగా వుంటోంది. అంతే కాకుండా కొంతమంది బాధితురాలి పైననే నిందలు మోపుతుంటారు. నిందితులకు శిక్షలు వేయించటానికి బదులు బాధితులకే నచ్చచెప్పటానికి, కుదిరితే బాధితులకే శిక్షలు వేయించటానికి అత్యుత్సాహం చూపిస్తుంటారు. అత్యాచారానికి గురి అయిన స్త్రీలు శీలం కోల్పోయిన వారనీ , వారు ఈ సోకాల్డ్ ప్రపంచంలో బ్రతకటానికి హక్కు లేదనే పాత వాసన గొట్టే సాహిత్యానికి , సినిమాలకు కొదవ లేదు. శిక్షలు పడాలి. ఎలాంటి శిక్షలు పడాలి? జైలు శిక్షయా? ఉరి శిక్షయా? అన్న చర్చలు జరుగుతున్నాయి.

బాధితురాలికి , నిందితునికి రాజీ ప్రయత్నాలు చేసినప్పుడు అత్యాచారానికి గురి అయిన స్త్రీ అంతరంగం ఎలా వుంటుంది అన్న విషయాన్ని కొత్తకోణంలో పి.రామకృష్ణగారు “ అత్యాచారం “ కథలో ఆవిష్కరించారు. యూనివర్శిటిలో ఎం.ఎ చదివే అరుణ సెలవులకని యింటికి వచ్చినప్పుడు తన స్నేహితురాలు శారదను కలవటానికి ఆమె యింటికి వెళ్లిన సమయంలో శారద అన్న రమణారావు అరుణపై అత్యాచారం చేస్తాడు. ఐదు నిమిషాలలో పని ముగించి అరుణను యింట్లో నుండి బయటకు తోసేస్తాడు. అది గ్రహించలేనంత షాకులో వుంటుంది అరుణ. అతను అరుణకు ఒకప్పటి లెక్చరర్ కూడా. విద్యార్థుల కష్టాలను తీర్చవలసిన అధ్యాపకులే భక్షకులుగా వున్న సమాజం. షాక్ నుండి కోలుకున్న అరుణ అరిచే అరుపులకు చుట్టుపక్కల జనాలు గుమికూడి రమణారావును తన్ని పోలీసులకు అప్పగిస్తారు. పెండ్లి చేసుకుంటాను కేసును విత్ డ్రా చేసుకొమ్మనే రాజీప్రయత్నాలు సాగిస్తాడు. అరుణ తల్లిదండ్రులు, మహిళా సంఘాలు, రాజకీయ నాయకులు రెండో ఆలోచన లేకుండా అంగీకరిస్తూ

“ ఇంత గొడవ జరగకపోతే , అతనిలాంటి సంబంధం

# కరువూ ఆ తర్వాత



హిందీమూలం: నాగార్జున్
అనువాదం: ఘట్టమరాజు
09964082076

చాలా రోజులదాకా
పొయ్యి ముక్కుతూ మూలిగింది
విసుర్రాయి మొగం వేలాడేసింది
చాలారోజుల దాకా
గుడ్డికుక్క వాటివద్దే నిదరోయింది
చాలారోజుల దాకా
గోడ మీద బల్లి గస్తీ తిరిగింది
చాలా రోజులదాకా
ఎలుకలదీ అదే గతి

ధాన్యలక్ష్మి ఇంటికొచ్చింది చాలా రోజుల తర్వాత
పొగ వెలువడింది ఇంటిచూరు నించి చాలా రోజుల తర్వాత
మిలమిలా మెరిసాయి యింటిల్లిపాదీ కళ్ళు చాల రోజుల తర్వాత
కాకి కళ్లు పులుముకొంది చాలా రోజుల తర్వాత

❋

తమకు అందుబాటులోకి వచ్చేది కాదు " అన్న తల్లిదండ్రుల సర్దుబాటు ధోరణి అరుణని మరింత బాధిస్తుంది. రచయిత యిక్కడ అత్యాచారానికీ, శిక్షకు యిచ్చిన నిర్వచనం, సమాజంపై సంధించిన బాణం.

"మగవాడు ఏదో అవకాశం దొరికినప్పుడు స్త్రీ పై జరిపే అత్యాచార క్రియలోనే అత్యాచారమంతా లేదు. సమాజంలో దాన్ని గురించి వున్న భావజాలంలోనే పెద్ద అత్యాచారం వుంది. కేసు గెలవకపోవచ్చు. వాడికి శిక్ష వేయించలేకపోవచ్చు. కోర్టులో లాయర్ ప్రశ్నలు అవమానకరంగా వుండవచ్చు. ఇవేవి వాడిని పెండ్లి చేసుకోవడమంత అవమాన కరమైనవి కావు...రేప్ చేసిన వాడికి, జీవితాంతం రేప్ చేసే అవకాశం యిచ్చే ఈ పెండ్లి వద్దనే వద్దు " .

పై పూతలుగా పనికివచ్చే కొన్ని సంస్కరణలు , పవిత్రతల గురించి జపం చేసేవారికి ఈ కథ తగిన సమాధానం యిస్తుంది.

స్త్రీల హక్కులు గురించి, స్వేచ్ఛను గురించి మాట్లాడటమంటే పురుషులను నిందించటం కాదు. సమాజంలో, కుటుంబంలో వేళ్లూనుకొని పోయిన పురుషాధిపత్య భావజాలాన్ని ప్రశ్నించడం అని ఈ కథలు తెలియచేస్తాయి. అమ్మకు ఆదివారం లేదా కథలో వేణు స్త్రీల సమస్యలు, హక్కుల పట్ల అవగాహనతో యింటిల్లిపాదిని చైతన్యపరుస్తాడు. నూరేళ్ల నిశ్శబ్దం కథలో తన ఆశయానికి గండిగొట్టే తల్లిదండ్రులను తనకు వున్న హక్కును చూపించి వారిని ఎదిరించి తన హక్కును కాపాడుకోటానికి మాధవి చేసే పోరాటానికి, హక్కును బలవంతంగా కోల్పోయిన తొంబై ఏళ్ల ముసలి నాయనమ్మ మద్దతు తెలుపుతుంది. ఉద్యోగం పురుష లక్షణం, వరకట్నం మగవాని జన్మహక్కు అని భావించే సమాజంలో వాటిని వ్యతిరేకించి చెల్లెలికి జరిగే నష్టాన్ని ఆపగలిగే యువకుడు ప్రశాంత్ ఒక పెళ్ళి కథలో కనిపిస్తాడు. తనకు జరిగిన అన్యాయానికి స్పందించి అండగా నిలవాల్సిన వాళ్లే పెండ్లి పేరిట తనకు అవమానం చేయటాన్ని సహించక ,దాన్ని ఎదుర్కోటానికి సిద్ధపడిన అధునిక యువతి అత్యాచారం కథలోని అరుణ . సమస్యల సంఘర్షణలల్లో కూరుకుపోయే బాధితులు ఒక్కొక్కసారి తామే తమ ఆలోచనలను పదును పెట్టుకుంటూ సొంతంగా చైతన్యం పొందుతారు. కొంతమంది సమాజాన్ని పరిశీలిస్తూ , సమస్యలను అర్థం చేసుకుంటూ , అవగాహనను పెంచుకుంటూ చైతన్యవంతులై బాధితులనును చైతన్యవంతులుగా చేస్తారు. బాధితులలో ఆత్మ విశ్వాసాన్ని కలిగించగల , నూతన , అధునిక సమాజాన్ని నిర్మించే చైతన్యం వున్న ఈ నాలుగు కథలల్లోని పాత్రలు పాఠకుల మనసుల్లో మెదులుతూనే వుంటాయి.

❋

# కవితాను గంధాన్ని అద్దిన రజనీగంధ




*ప్రకృతికీ, కవికీ గల అనుబంధం ఈ సంపుటి తొలికవిత 'రజనీగంధ' లోనే కన్పిస్తుంది. 'పూలకు తల్లి ఒడి అయినందుకే పులకరిస్తుంది నేల' అన్న పంక్తి చదవగానే 'చలికాలపు తొలిపొద్దుల సువాసనలు' వెదజల్లే పొన్నాయి పూల వలె పాఠకుని మనసు కూడా పరిమళిస్తుంది. 'ప్రపంచం పూలతోట' కావాలని, మనుషుల్లో మలయమారుతాలు ప్రవహించాలని కోరుకుంటాడు కవి. ఎంతటి కమ్మని భావన!*

**- సూర్యదేవర రవికుమార్**

**2016** వ సంవత్సరానికి కేంద్ర సాహిత్య అకాడమీ ప్రకటించిన ప్రతిష్టాత్మక పురస్కారాలలో కవితా ప్రక్రియలో తెలుగుభాషలో 'రజనీగంధ' అన్న కవితాసంపుటిని రచించిన డా. పాపినేని శివశంకర్‌కు లభించింది. కవిగానే కాక కథకునిగా విమర్శకునిగా, వ్యాఖ్యాతగా, సంపాదకునిగా శివశంకర్ లబ్ధప్రతిష్టుడు. ఈ పురస్కారం అతడికి అతడు కేంద్రసాహిత్య అకాడమీ సభ్యుడుగా నియమింపబడకముందే రావలసింది. అకాడమీ వారి యీ ఎంపిక తెలుగు భాషాభిమానులు, సాహితీవేత్తలు అందరూ అభినందించదగినది, ఆనందించదగినది.

రజనీగంధ అన్నది 50 వచనకవితల సంపుటి. ఇది 2013లో ప్రకటించబడింది. దీనికి ముందే శివశంకర్ స్తబ్ధత–చలనం, సారాంశం కోసం, ఆకుపచ్చని లోకంలో, ఒక ఖడ్గం – ఒక పుష్పం అన్న కవితా సంపుటాలను ప్రకటించాడు. ఆ కవితలు సాహితీప్రియుల విమర్శకుల ప్రశంసలనందాయి.

రజనీగంధలోని 50 వచన కవితా ఖండికలలో గల వస్తువైవిధ్యం స్థూలంగా ఈ విధంగా ఉంది.

| | | |
|---|---|---|
| ప్రకృతిచిత్రణ | : | 4 కవితలు |
| ఆత్మాశ్రయం | : | 14 ,, |
| సామాజిక స్పృహ | : | 4 ,, |
| రైతు కవిత | : | 1 కవిత |
| వ్యక్తుల గూర్చి | : | 4 కవితలు |
| స్త్రీవాదం | : | 3 ,, |
| ప్రేరణ కవితలు | : | 4 ,, |
| ప్రత్యేక సందర్భాలు | : | 5 కవితలు |
| ఇతరాలు | : | 9 ,, |
| మొత్తం | | 50 |

శివశంకర్ ప్రకృతిప్రేమికుడు. నిజానికి ప్రకృతిని ప్రేమించనివాడు కవే కాదు గదా! తన ఇంటి ఆరుబయట ఉన్న పొన్నాయిచెట్టు, అనంతవరం కొండ, తన ఇంటబుట్టిన కోడెలు, తనను వెన్నంటే కుక్కపిల్ల, చెట్టుమీద ఉడత, గడ్డిమీద తూనీగ, జొన్నకర్ర మీద ఉయ్యాలలూగే పిచ్చుక వంటివి అతని ఆత్మీయస్నేహితులు, ప్రేమికులు.

ప్రకృతికీ, కవికీ గల అనుబంధం ఈ సంపుటి తొలికవిత 'రజనీగంధ' లోనే కన్పిస్తుంది. 'పూలకు తల్లి ఒడి అయినందుకే పులకరిస్తుంది నేల' అన్న పంక్తి చదవగానే 'చలికాలపు తొలిపొద్దుల సువాసనలు' వెదజల్లే పొన్నాయి పూల వలె పాఠకుని మనసు కూడా పరిమళిస్తుంది. 'ప్రపంచం పూలతోట' కావాలని, మనుషుల్లో మలయమారుతాలు ప్రవహించాలని కోరుకుంటాడు కవి. ఎంతటి కమ్మని భావన!

అనంతవరం కొండ శివశంకర్‌కు ఆ బాల్యమిత్రం. అది తనతో "పచ్చీసు గళ్ళలాంటి మెట్టచేల ఆకుపచ్చని పాటల్ని, అందులో ముసిరిన దిగులు సంగతుల్ని" వినిపిస్తుందట. కొండను చూస్తే కవికి చేత కాదని వాటి సాగుదారుల జీవితాలు తలపుకు వస్తున్నాయి. ఆ కొండతో తన అనుబంధాన్ని నెమరువేసుకున్నాక "నిజంగా ప్రతి మనిషీ బతుకంతా కోర్కెల బరువుల్తో ఒక కొండ నెక్కుతానే వున్నాడు. మెట్లు తరగవు. సిగరం అందదు తాపం తీరదు" అంటూ ఒక సార్వకాలిక సత్యాన్ని ఆవిష్కరించాడు. అలాగే ప్రకృతిలోని చెట్టు, నది, నేలలను ప్రస్తావిస్తూ "చెక్కుచెదరని మట్టివాసన" మానవులకు వాటి మూలాలను గుర్తు చేస్తూ, వారి మధ్య దూరాలను తగ్గిస్తూ వారిని పరస్పర ప్రేమికులుగా చేస్తుందని విశదీకరిస్తారు. 'నువ్వూ – నేనూ' అన్న కవితలో పుట్టిన మట్టి మీద శివశంకర్‌కు గట్టిప్రేమ.


డా॥ పాపినేని శివశంకర్

ఒకప్పుడు ప్రకృతిలోని ఇతర జీవులవలె ఆరుబయట హాయిగా నిద్రించే మానవుడు ఈనాడు అభద్రతా భావంతో "ఏవీ మూసెయ్యకుండా, నిర్భయంగా నిశ్చింతగా నిద్రపోలే"ని తనాన్ని 'అన్నీ మూసేసి' అన్న కవితలో అద్భుతంగా చిత్రించాడు. "వేడెక్కనిదే ఏదీ పనికిరాదు" అని సిద్ధాంతీకరిస్తూ ప్రకృతిలోని ఎండపొడ కోసం తపిస్తాడు 'ఎండపడనీ' అన్న కవితలో.

వ్యక్తిగా శివశంకర్ ఆత్మానుభూతులు 14 కవితలలో ప్రతిబింబిస్తాయి. వీటిలో అమెరికా ప్రయాణం, అక్కడ ఇద్దరు మనుమళ్ళతో ముచ్చట్లు, నయాగరా జలపాతం, చికాగోలో మేడే ఉత్సవం, వివేకానందుడు ప్రసంగించిన వేదిక, పాఠశాలలో కూడా చెలరేగిన కాల్పులు, ఇలా వీటిలో అమెరికా అనుభవాలే ఉన్నాయి. శ్రీనగర్‌లోని డాల్‌సరస్సులో విహరించటం మరొక వస్తువు.

శివశంకర్ నిరంతర పాఠకుడు. జీవిత తత్త్వాన్వేషి, ఎప్పుడూ "చదువుతూ చదువుతూ" నే ఉంటాడు. తను ఏం చదివాడో ఇలా చెపుతున్నాడు.

'అమృతం కురిసినరాత్రులు, మరో ప్రపంచాలు
మాలపల్లులు వనవాసులు సముద్రంపై ముసలివాళ్ళు
మైదానాలు రంగభూములు ఎడారులు పరుసవేదులు
ఓల్గానుండి గంగకు ప్రాచీన ప్రయాణాలు
అమ్మలు యుద్ధశాంతులు నేరశిక్షలు
బృహత్కథలు బహుతంత్రాలు
గాథాసమూహాలు
పర్వాలు స్కంధాలు, కొండలు ఆశ్వసాలు
వేలవేల పుటలు"

వీటిలో ప్రాచీన, పాశ్చాత్య దేశాల ప్రాచీన ఆధునాతన వాఙ్మయం ఇమిడి ఉంది. ఇంత వైవిధ్యభరిత సాహిత్య పాఠకుడు నిరంతర 'అన్వేషి' కాక ఏమౌతాడు? ఇంత చదివిన వాడూ "గుండెలమీద బోర్లా తెరిచిన పుస్తకంతో/ నిద్రలోకి జారినట్టు నిశ్శబ్దంగా నిష్క్రమించ"టాన్ని కోరుకోవటంలో కూడా వింతలేదు. నిరంతరం ద్రవించే శివశంకర్ ఆత్రం "సమస్తప్రాణివేదనలో లీనమౌ"తుంటుంది.

జీవితాన్ని "ఒక అద్భుత పుష్పం వికసించే ప్రక్రియ"గా భావిస్తాడు. శివశంకర్. దానిని 'పరిమళభరితం చేసుకునేందుకు దయ అనే రెండక్షరాలు" దిద్దాలని, వెండివెన్నెల్తో ఆడుకోవాలని, "ఊహలరెక్కలు తొడుక్కొని ప్రకృతి ప్రేమికుడై విశాల దృక్పథాన్ని పెంపొందించుకోవాలని, మనసును దీవింపచేయని చదువు చదవాలని, స్వీయ వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలని బంధిస్తాడు. ఈ బోధ ఆత్మాశ్రయమైనదిగానే భావించాలి.

ఆధునిక వచన కవిత్వానికి సామాజిక స్పృహ ముఖ్యలక్షణం. అది లేనిది కవిత్వమేకాదని, ఒకవేళ అయినా అది అప్రయోజనకరమనీ నేటి వాదన. రజనీగంధలో ఈ స్పృహ గల కవితలు నాలుగున్నాయి.

"నెత్తురు కల్లాపి మీద కాలుజారు" తున్న దేశాలు ఆయుధాలు పట్టి ఆర్తనాదాలు సృష్టిస్తుంటే ఆ ఆయుధం "ఒక వ్యర్థ పదార్థమయ్యే రోజుదాకా / యుద్ధం ఒక పురాతన పదమయ్యే కాలం దాకా" పోరాడమని అర్థిస్తాడు. "సమస్త సింహాసనాలు / ఒక దయా వృక్షానికి సాటిరావు" అని ప్రబోధిస్తాడు. ప్రపంచ శాంతికి ఇంతకు మించిన ప్రార్థన ఏముంటుంది. ఆడపిల్లలపై జరుగుతున్న యాసిడ్ దాడులను నిరసిస్తూ "ఐ లవ్ యు" అనే పరాయి వాక్యాన్ని ప్రేమించవద్దంటాడు. ప్రేమంటే "వెన్నెల అలలాంటి/ అలలపూల సువాసనలాంటి / తనువు–గుప్పున విరిసిన చుక్కల పూల చెట్టుకావటం లాంటి / అనుభూతి" అని వివరిస్తాడు. అలాగే ఈనాటి యువసమాజంలోని వికృత వస్త్రధారణను వ్యతిరేకిస్తాడు. "మనిషన్నాక" అప్పుడప్పుడైనా శ్రమైకజీవన నిసర్గసౌందర్యం ప్రతిబింబించేలా కనిపించాలని ఆకాంక్షిస్తాడు. అతి శుభ్రతను అధిక్షేపిస్తాడు. "దేశం చీకటి తావులెన్నిట్లోనో

"గుడ్లుపెట్టిన / పాములను పట్టే సర్పమాంత్రికుడు" అన్నా హజారే సాగించిన అవినీతి వ్యతిరేకోద్యమానికి సైదోడుగానైనా నిలవాలని ఉబలాటపడతాడు. సామాజిక స్పృహ అంటే వ్యవస్థపై తిరుగుబాటుగా, పరుష/ నీచ పదజాలంతో దానిని వ్యక్తీకరించటంగా భావించటం జరుగుతున్నది కాని అందుకు భిన్నమైనది శివశంకర్ సామాజిక స్పృహ.

**రజనీగంధలోని శివశంకర్ కవితాశైలి ఈనాటి సాధారణ వచన కవితాశైలికి మించి ఉన్నతమైన శైలిలో కన్పిస్తుంది, కవిత్వంలో ఒక చిక్కదనం గోచరిస్తుంది.**

రైతుబిడ్డగా శివశంకర్ సేద్యంలోని కష్టసుఖాలు తెలిసినవాడు... కనుకనే "ప్రయోగ నాళిక ప్రమాదపుత్రిక' గా బి.టి. పత్తి విత్తనాన్ని పోల్చగలిగాడు. "అరచేతిలో వైకుంఠం చూపిస్తూ ఈ నేల పంటల వైనాన్ని దుంపనాశనం" చేసి కూలీలకు ఎలర్జీని, ఆ 'నాము మొలకలు చిన్న గొడ్ల'కు ఎండుతనాన్ని గలిగిస్తుందంటు దానిని 'శటానిక్ బ్యూటీ'గా అభివర్ణించగలిగాడు.

రజనీగంధలో శివశంకర్ నలుగురు వ్యక్తుల గురించి వ్రాసిన కవితలున్నాయి. వారు ప్రముఖ షెహనాయ్ వాద్యకళాకారుడు బిస్మిల్లాఖాన్; 40 ప్రపంచ భాషలలోకి అనువదింపబడిన బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్ అన్న గ్రంథరచయిత, ఎం.ఎల్.యస్. అనే అరుదైన భయంకర వ్యాధికి చిన్న వయసులోనే గురి అయినా మనోధైర్యంతో భౌతికశాస్త్రంలోను, కాస్మాలజీలోను విశేష కృషి చేసిన స్టీఫెన్ హాకింగ్; గుండె జబ్బుతో బాధపడుతున్న మిత్రుడు రవిబాబు; అంధురాలైన ఉపాధ్యాయిని గాయత్రి.

'అచ్చమైన గుండె తెరిచి తన జాతి ఆత్మను ప్రపంచానికి ప్రదర్శించాడు' అని బిస్మిల్లాఖానును ప్రశంసించాడు. 'ప్రపంచంలో ప్రతి అవిటి వాడికీ దిటవు గుండె నిచ్చినవాడు' అని హాకింగ్‌ను కీర్తించాడు. 'గుండెలయ తప్పనివ్వద్దు' అని అపారమైన ధైర్యాన్ని నూరిపోశాడు రవిబాబుకు. "నయనం కాదు దర్శనమే ప్రధానం / చూడాల్సిన లోపలి కన్ను సరళంగా ఉంటే చాలు" అని గాయత్రిని ఊరడించాడు శివశంకర్.

ప్రత్యేక సందర్భాలను పురస్కరించుకొని శివశంకర్ వ్రాసిన నాలుగు కవితలు రజనీగంధంలో ఉన్నాయి. 15వ తాజా జ్ఞాపిక సంచిక తెలుగు పలుకు కోసం వ్రాసిన 'అఖండం' కవిత ప్రవాసంలోని తెలుగువారి నుద్దేశించింది. వాళ్ళ చిన్ననాటి స్మృతుల్ని తలపుకు తెస్తూ "అంతరంగంలో ప్రాచీన పుటరణ్యాలు ఆకాశాలు / ఇంకా విస్తరిస్తున్నా"యా" అని వాకబు చేస్తూ "ఎవడైనా ఈ బీటలు వారే నేల మీద/ ఖండఖండాలు కాకుండా ఉండటం తేలికేమీకాదు" అంటూ ప్రవాసాలు తప్పవని చెపుతాడు. గుంటూరు కళాపరిషత్ ప్రత్యేక సంచిక దృశ్యం కోసం వ్రాసిన కవిత 'మహత్తర ప్రదర్శన', నాటక ప్రదర్శనలో నటులు పాత్రలలో జీవించాలని, లేకుంటే "నవరసాల వరదలో ప్రేక్షకులంతా కొట్టుకుపోగా/ నాటకశాలలో సారహీనశూన్య"మే మిగుల్తుంది అంటాడు. కైరళి అన్న కవిత కేరళలో దర్శించిన తుంజన్ మహోత్సవం ను గురించినది. తన జన్మదినమైన దీపావళి సందర్భంగా వ్రాసిన 'దీపం ముట్టించు' కవితలో "దీపం ఒక మొగ్గ / దీపం ఒక పువ్వు/ అపురూప కాంతి సుగంధపవనం" అంటూ దానిని తనతోపాటు ప్రతిహృదయంలోను వెలిగించాలని ఆకాంక్షిస్తాడు.

స్త్రీలపై శివశంకర్‌కు ఉన్న ఉదాత్తభావాలు 'స్త్రీలు-పురుషులు' అన్న కవితలో వ్యక్తమౌతాయి. స్త్రీలు "సృష్టికి తొలి బీజాలు, భూదేవతలు, సూర్యచంద్రులు రెండుస్తనాలైన వాళ్ళు" అని కీర్తిస్తాడు. స్త్రీ పురుషుల సంబంధాల గురించిన గాఢమైన తాత్వికధోరణి 'ఆలోచనాలోచన' అన్న కవితలో కన్పిస్తుంది. ఈ తాత్వికత సుబోధకం కాదు. గుంటూరు కార్పోరేట్ విద్యాసంస్థల్లో చదివే "గుంటూరమ్మాయి" స్టైల్‌ను శివశంకర్ చక్కగా చిత్రించాడు.

ఇక ఖలీల్‌జిబ్రాన్, సాక్ష్యాల వచనాలు, క్రికెట్ గురించి బెర్నాడ్‌షావ్యాఖ్య, బృహదారణ్యకం (ఈశావాస్యమని ముద్రితం)లోని "పూర్ణమదః..." ఇత్యాది శ్లోకభావం ప్రేరణగా చక్కని కవితలు వ్రాశాడు శివశంకర్. చిత్రంగా, ఈ సంపుటిలో రెండు కవితలు 'గద్య' కవితలుగా కన్పిస్తాయి. చేసిరి, తాగించిరి, పాటించిరీ వంటి క్రియారూపాలు వీటిలో దర్శనమిస్తాయి. ఇది ఇతర 'వచన' కవితల రచన శైలికంటే భిన్నమైనది.

రజనీగంధలోని శివశంకర్ కవితాశైలి ఈనాటి సాధారణ వచన కవితాశైలికి మించి ఉన్నతమైన శైలిలో కన్పిస్తుంది, కవిత్వంలో ఒక చిక్కదనం గోచరిస్తుంది. 'బాధానంద శప్త జలపాత తరంగిణి' 'వినీల గానమోహిత గగనం' 'సుప్త సువాసల మోహనలతో' 'సతతీ రక్తప్లావిత క్షతయోనులు' వంటి పదబంధాలు, భాష ఈనాటి వచన కవితలలో చాలా అరుదుగా కన్పిస్తాయి. 'పచ్చికమొలవని కార్పోరేట్ మనోమైదానాలు' 'నాని నాని చీకిపోయిన మాటల రవంతమూడెండ' 'ముదురెరుపు

# కొత్త మిత్రుడు

- పాతూరి అన్నపూర్ణ



ఓ పదేళ్ళ కిందటి మాట
స్నేహితులందరం కలిసేవాళ్ళం
ఒకేగూటి పక్షులు ఒకచోట చేరినట్లు
అందరం మా ఊరు చేరేవాళ్ళం
చదువుల బరువులు పూర్తయి
ఎవరి జీవిత శైలి వారిదైనా
ఏడాదికోసారి సొంతూరు చేరేవాళ్ళం
మా రాకతో ఊరికి పండగకళ వచ్చేది
పలకరింపులు జల్లులై కురిసేవి
చెట్లనీడల్లో సేద తీర్చుకుంటూ
ఊరిగాలిని గుండెనిండా పీల్చుకొనేవాళ్ళం
మాటల కొమ్మలకు పూలు పూచేవి
మమతల బంధాలకు చిగుర్లు పుట్టేవి
కబుర్లతో కడుపునింపుకుని
మళ్ళీ కలుసుకునే ఏడాదికి సరిపడా
జ్ఞాపకాలను మూట కట్టుకునేవాళ్ళం
రాను రాను కాల చక్రవేగం పెరిగింది
మా మధ్యన ఓ మాయగాడు ప్రవేశించాడు
మీ కొత్త మిత్రుణ్ణంటూ చేయికలిపాడు
వాడిగారడీకి అందరం కట్టుబడిపోయాం
మా కలుసుకోడాలు ఆగిపోయాయి
భౌతిక ప్రపంచాన్ని మర్చిపోయాము
ఏడాదికోసారి వలస పక్షుల్లా కలిసే మేము
ముఖపుస్తక మిత్రుల్లా మారిపోయాము
ఇప్పుడు మా కబుర్లన్నీ చరవాణి మోస్తున్నది
క్షణంలో అంతర్జాలం మమ్మల్ని కలుపుతున్నది
శుభవార్తలకూ, అశుభవార్తలకూ
ముఖ పుస్తకమే వారధిగా మారింది
ఇంతకంటే మనుషుల్ని తనకు బానిసలుగా
చేసుకునే మాయగాడు మరొకడుంటాడా?
ఎంత ఆధునిక ప్రపంచంలో జీవిస్తున్నా
స్పందనలో హృదయం బరువెక్కడం
ఆలింగనాలతో కళ్ళు చెమర్చడం వంటి
సహజానుభూతులు లేకుండానే
ఏళ్ళు జరిగి పోతున్నాయని
ఎప్పుడో ఓసారి గుండె కలుక్కుమంటున్నది

❋

---

వాత్సల్యపుపళ్ళు' వంటి అలంకారపు ఆడంబరం ఉన్నా అది అస్పష్టతకు దారితీయదు. ముచ్చబోడు వంటి మాండలిక పదాలకు అర్థం చూపితే బాగుండేది.

'గట్టుమీదికి' అన్న కవితలోని "ఏనుగు ఒంటిమీది విభూతిపట్టెడ' కాళిదాసు మేఘసందేశ శ్లోకాన్ని గుర్తుకుతెస్తుంది. 'మునుపు మసీదు వాకిటను ముచ్చెలు దొంగిలిపోతి" అన్న దువ్వూరి రామిరెడ్డి గారి పద్యపాదం యథాతథంగా ఉదహరించబడింది. ఇలా ప్రాచీన, అధునాతన కవుల కవితలను జ్ఞప్తికి తెప్పిస్తూ శివశంకర్ ప్రతిభను ప్రదర్శిస్తుంది రజనీగంధ.

రజనీగంధ కవితలలోని 'ద్రౌపదిదాపలి చేతిలో కేశపాశం"ఆంజనేయుడు బెదిరే మహామార్గ సముద్రాలు' 'అభిమన్యుడు ఛేదించలేని ఫ్రీవే పద్మవ్యూహాలు' 'అరచేతిలో వైకుంఠం' వంటిది కవిత్వంలో భారతీయతను ఎంతగా ప్రతిబింబిస్తాయో "ఫ్రీవేపై లాంగ్‌డ్రైవ్, 'డిసెంట్' 'రొటీన్' 'రీప్లేస్' 'శటానిక్ బ్యూటీ వంటి ఆంగ్లపదాలు దాని ఆధునికతను చూపిస్తాయి. కల్లాపి, బడితె, వాసిగర్ర, బర్రెగొడ్డు, తస్సాదియ్య, దొంకదువ్వ వంటి గ్రామీణ పద ప్రయోగాలు ఎంత మురిపిస్తాయో, దారమ్మటి, మల్లే, తెలీదు, ఇయ్యాల్టికి, మాట్లాడుతానే" వంటి పద ప్రయోగాలు అంతగా చికాకు కల్గిస్తాయి. 50 కవితల చిన్న పుస్తకంలో కూడా అచ్చుతప్పులు నిలవటం విచారకరం.

2005-13 మధ్య కాలంలో వ్రాసిన కవితలతో డా.పాపినేని శివశంకర్ రూపొందించిన రజనీ గంధ కవితా సంపుటిలోని తెనుగు నుడికారపు సొంపు, కవితాసుగంధం కేంద్ర సాహిత్య అకాడమీకి తాకి తగిన గుర్తింపును పొందటం తెలుగు కవితాభిమానులు ఎంతో సంతోషించదగిన విషయం.

❋

# అంతరంగ తరంగం

- చెన్నా రామమూర్తి
8886885178



దీక్షగా నేస్తున్న మగ్గాన్ని కాసేపు ఆపాడు.

'నగిషీలు చక్కగా దిగటం లేదు. గిలకలో ఎక్కడో లోపముంటుంది. చిన్నోడు పెక్కుల్ని సరిగా ఎంచుకొని కొట్టలేదేమో...! ఏం చేయాలో...' పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు వెంకట్రామయ్య.

నెమలిపించం పేటులో ముదురాకుపచ్చ వర్ణం పొడచూపాలి. పేటు అందంగా ఉంటుంది. అది సరిగా రావటం లేదు.

ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది.

భాగ్యలక్ష్మి తుండుగుడ్డతో వీపును తుడుస్తూ, "కుదుర్తుందిలే.... రామకిట్టన్నను పిల్సు. సర్సేసి పోతాడు. రొంచేపు ఇటొచ్చి గాలిక్కూర్చో...." అంది.

డబుల్ తాపెట్ (గిలక)పై మంచి నగిషీలు దించిన రెండంచుల ప్యూర్ జరీ పట్టుచీరల్ని కంచి సిల్క్ హౌసుల్లో కళ్ళకద్దుకొని తీసుకుంటారంట. వీలయినంత త్వరగా డబుల్ తాపెట్‌ను సరిచెయ్యాలి.

మగ్గం బాగా కుదుర్తే, మంచి నాణ్యంగా వస్తాయి పట్టుచీరెలు. వాటిని కంచి శిల్కు హౌసులకు పంపాలి. గిరాకీ ఉన్నపుడు నాలుగుదుడ్లు ఎనకేసుకొని భాగ్యలక్ష్మి ముచ్చట తీర్చాలన్నది వెంకట్రామయ్య కోరిక.

భర్త అభివృద్ధిని కాంక్షిస్తున్నా, భార్య మనసులో వెలితి, అసంతృప్తి తొణికిసలాడాయి. 'నలభైవేలు అందుబాటులోకి రాగానే, మెడలోకి తాళిబొట్టు సరుటు తెస్తానన్నాడు. ఇప్పుడేమో తాపెట్ మగ్గంపై చీరలు నేస్తే ఇంకా సంపాదించొచ్చని, ఆ డబ్బునంతా వీటిని కొనడానికే సరిచేసే".... అనుకుంది.

భర్త పడే శ్రమను చూసి, "అయ్యో పాపం.... ఎంత కష్టపడతాడో..." అనుకుంది.

తలవాకిటి నుంచి వీచే వేపచెట్టు గాలిని ఆస్వాదిస్తూ ఒడిలోకి లాక్కుంది. తొడపై తలవాల్చి కళ్ళలోకి చూశాడు. ఆర్తి, ప్రేమ, తన్మయత్వంతో నిండిపోయాయి కళ్ళు. పొదవిపై చేయి వేసేసరికి నల్లల దండకున్న రెండు పగడాల మధ్యనున్న తాళి తన ముఖాన్ని తాకింది. వెంకట్రామయ్య మనసులో ఖాళీ ఏర్పడింది.

"చిన్నా... ఈ కొత్త తరా మగ్గం కంటే నీకు తాళిబొట్టు సరుగు తెచ్చింటే బాగుండు కదూ...! పోన్లే చిన్నా... మగ్గం బాగా జరిగి రెండు సాపులు అయితే నలభై వేలొస్తుంది. అది

ఎన్నాళ్ళు... రెండు నెలలు బాగా జరిగితే వస్తాయి. బాధ పడకే".... అని కళ్ళలోకి చూశాడు.

మాటల్లేని ఆ కళ్ళ భాషను అప్రయత్నంగానే గమనించాడు.

ఆ వెలితిని పూడ్చటానికి ఎన్ని మాటలు చెప్పినా వృధా ప్రయత్నమే..." అనుకున్నాడు.

అతని మౌనంలోని అంతరంగం ఆమె మనసును తాకింది.



నిలబడి పరిశీలనగా చూశాడు. మళ్ళీ చిన్న మార్పులు చేశాడు. అన్నీ కలిపి చూస్తే వినాయకుని ప్రతిమలా కనిపిస్తుంది.

ఎదురుగా నిల్చొని, కళు ్ళమూసుకొని," మా నాన్న జీవితాంతం ఇదే మగ్గం మీద బ్రతికాడు. పోతూ పోతూ నాకు ఇచ్చాడు. దేవుడా నన్నూ, నా పెళ్ళాం పిల్లల్ని కాపాడుతూ, పచ్చగా ఉండేట్లు చెయ్యి తండ్రీ...." దీవెనలు అందుకున్న భావనతో తృప్తిగా కళ్ళు తెరిచాడు వెంకట్రామయ్య.

♦ ♦ ♦

మగ్గాన్ని దైవంగా భావించి, వృత్తిని శ్వాసగా చేసుకొని దీక్షగా పట్టుచీరలు తయారు చేయటమే తెలుసు వెంకట్రామయ్యకు. వినాయక చవితి వచ్చిందంటే ఆయనకు ఒళ్ళంతా పండగే.

లాటు, దోనె, సిల్ల, చౌడుకట్టె, కొమ్ములు, డోలు, మోకు, చెక్క ఊసలు, చేతిపలక, అల్ల కట్టెలు, బొట్టెకట్టె – అన్నింటిని బయట రెండు మంచాలపైకి చేరుస్తాడు.

రంగస్వామిని నాలుగు బకెట్లు నిండు కడవ నీళ్ళు తీసుకురమ్మంటాడు. భాగ్యలక్ష్మిని పీచు, సబ్బు తెమ్మంటాడు. నిష్ఠతో అన్నీ శుభ్రం చేయటానికి సిద్ధపడతాడు.

రంగస్వామి నీళ్ళు సిద్ధంచేసే సమయంలో వర్షం ప్రారంభమైంది.

'నాన్నా... వానొస్తాందిలే..., ఇంక మన నీళ్ళతో పని లేదులే నాన్నా..." అన్నాడు రంగస్వామి.

'వద్దు నాన్నా... నిండుకడవ నీళ్ళే కావాల.

నువ్వుపోయి ఎత్తుకొని రాపోమ్మా...' అంటూ పురమాయించాడు.

పూజారి మూలవిరాట్టును నియమ నిష్ఠలతో శుభ్రం చేసినట్లు, ప్రతీ వస్తువునూ శుభ్రంచేసి, పొడిబట్టతో తుడిచి, దేవుడి మూలనున్న వేదికపై చేర్చాడు.

గంధం, అక్షింతలు కలిపాడు.

లాటు, చేతి పలకల్ని చేతిలోకి తీసుకొని, కళ్ళకద్దుకున్నాడు. మూడు గంధంబొట్లు పెట్టి, వాటిపై అక్షింతలు, ఎర్రకుంకుమ కుదురుగా పెట్టాడు. కొమ్ముల్ని, ఊసల్ని, అల్ల కట్టెత్న అర్ధచంద్రాకారంగా పేర్చాడు. దోనెను కౌగిలించుకొని 'స్వామి'.. అన్నాడు. నామంతో ఉన్న తొండం ఆకారం వచ్చేట్లు లాటుపై మధ్యలో నిలబెట్టాడు. దూరంగా

♦ ♦ ♦

భాగ్యలక్ష్మితో ఇక మాటలేమీ చెప్పకూడదనుకున్నాడు. నలభైవేలు చేతికందంగానే ముందు తనకు తాళిబొట్టు సరుటు చేయించాలి. మల్ల ఉంటే తినాల, లేకుంటేలే... దృఢ నిశ్చయం అంతే. దీక్షతో మగ్గం నేస్తున్నాడు. నెమలికంఠం రంగు చీరకు సింధూర వర్ణపు అంచుపై, హంసలపేటు అతికినట్లుంది. ఎక్కడా పోగు పోకుండా, ఏ తేడా లేకుండా చీరలు తయారు చెయ్యటమంటే ప్రాణం ఆయనకు.

'చూడే చిన్నారి చీర... నువ్వోసారి చుట్టుకోయే.... కుందనపు బొమ్మలాగుంటావు. కళ్ళారా చూస్తాను."

'సరే... సరేలేవయ్యా సామీ... భలే ఒగలు. నేను చుట్టుకుంటే చీర నలుగుతుంది. రేటు తగ్గుతుంది."

చీరెందుకు నలుగుతుందే తిక్కదానా... మనమేమన్నా సంసారం చేస్తాండామా... ఏంది...? అంటూ దగ్గరికి లాక్కున్నాడు.

'మడత పెడదాం పట్టు'... అన్నాడు

చీరని మడతపెట్టి పెట్టెలో పేర్చాడు.

'పద్దెనిమిది చీరలయ్యాయి. ఇంక ఏడు చీరలయితే ముప్పైరెండు వేలవుతుంది. ఇంకో పది పన్నెండు వేలు శిల్కు హౌస్ ఆసామితో 'పై లెక్క' ఇప్పించుకొని తాళిబొట్టు సరుటు తెస్తే పని అయిపాయ", మనసులో తోచిన ఆలోచన తృప్తినిచ్చింది.

అపుడు భాగ్యలక్ష్మిని చూడాలనిపించింది.

వంటగదిలో రెండుకాళ్ళ మధ్య సట్టిని పెట్టుకొని రాగి సంగటి గెలుకుతా ఉంది. చెవుల కింది నుంచి చెమట జారి నల్లపూసల మీదుగా పడి ఇంకిపోతోంది. వెనకనుంచి మెల్లగా వెళ్ళి హత్తుకున్నాడు.

"సరే పద తిందాం..."

రాగి సంగటి, నెయ్యి కలిపిన చెనక్కాయ కారం, మజ్జిగలతో భోజనం ముగించారు.

భాగ్యలక్ష్మితో తాళిబొట్టు సరుట ప్రస్తావన తీసుకురాలేదు. ఎందుకంటే...

◆ ◆ ◆

ఆ మధ్య ముప్పైఐదు వేలు చేతికొచ్చింది. సరుటు తెస్తానని బయలుదేరే సమయానికి రంగస్వామి ఇంజనీరింగ్‌లో చేరే సమయమొచ్చె... దండ ముఖ్యమా...! పిల్లోడి చదువు ముఖ్యమా...! 'దండ లేకంటే మెడేమైనా పీక్కుపోతా ఉందా...!" అని ఒకరిద్దరు అనడంతో – ఇరువురూ ఒక నిర్ణయానికొచ్చి, రంగస్వామిని టౌన్లో ఇంజనీరింగు చేర్పించిరి. మిగిలిన పదోపరకతో మగ్గం సరిచేయించిరి. అపుడూ ఊగి ఊగి సరుటు తీసుకురాలేకపోయాడు.

ఇంకో సందర్భంలో..... డబ్బు సమకూరే సమయానికి తల్లి మరణించింది. కన్నపేగు బాధ కదా...! ఎక్కడా రాజీ పడలేదు. కరమంతరాలకు రెండు పొట్టేళ్ళు కోసి అమ్మ ఆత్మశాంతికి మించిన ఆనందం లేదని చెప్పెసె... అందరూ 'భేష్' అనిరి.

రెండు సందర్భాల్లోనూ కిమ్మనలేదు భాగ్యలక్ష్మి. 'పరిస్థితులు అలాంటివి కదా....! అర్థం చేసుకోవాలి మనం".... అన్న వెంకట్రామయ్య మాటలకు మౌనం సమాధానమయ్యింది. కాసేపయ్యాక "ఎవరు కాదన్నారయ్యా" అంది.

◆ ◆ ◆

చీరలసాపు దగ్గిరైంది. మొత్తం ఇరవై ఐదు చీరలు. ఏకంగా కంచి శిల్కు హౌస్‌లకు వెళ్ళాలనుకున్నాడు. కానీ వాళ్ళు పై లెక్క ఇవ్వరు. అపుడు సరుటు కొనలేదు. అందుకని ధర్మవరం సిల్కు హౌస్ ఆసామి పురుషోత్తం వద్దకు తీసుకొని వెళ్ళాడు.

చీరలన్నీ చూసుకున్నారు. పాటాఖర్చు రాశాడు పురుషోత్తం. "బాగున్నాయి వెంకట్రామయ్యా చీరలు. చీరకు నూరు రూపాయలు ఎక్కువ వేసి ఇచ్చినా సూడు" అంటూ చీరల పట్టీ ముందుకేశాడు.

తృప్తిగా ఉంది వెంకట్రామయ్యకు. 'మరో రెండువేల అయిదొందలు కలిసొచ్చాయి. అంతే చాలు దేవుడా... మగ్గాన్ని నమ్ముకుంటే బ్రతుకుంది' అనుకున్నాడు.



'పురోత్తం... ఇపుడు నాదగ్గర ముప్పై నాలుగు వేల ఐదొందలుంది. భాగ్యకు తాలిబొట్టు సరుటు చేయించాల. కనీసం రెండు తులాల్లోనన్నా తీసుకుందాం... ఆ తక్కువొచ్చే లెక్క నువ్వు పెట్టు. పైలెక్క. వచ్చే సాపులో పట్టుకుందువు". ఒద్దికగా మాట్లాడాడు.

'నువ్వెప్పుడు పోదామంటే అప్పుడు పోదాం.

ఆలస్యమైతే మల్లా ఈ లెక్కకు రెక్కలొస్తాయని భయము"... అన్నాడు సమాధానం కోసం ఎదురుచూస్తూ.

'అది సరే వెంకట్రామయ్యా! అందరూ కరెంటు మగ్గాలు తెచ్చుకుంటున్నారు. అదే పవర్‌లూమ్స్... నీకు తెలంది కాదు. నువ్వు మగ్గంలో మూడురోజులకు ఒక చీర నేస్తావు. అదే కరెంటు మగ్గంపై రోజుకు నాలుగు చీరలు నేస్తావు. ఎంత తేడా... ఏంది...?' వివరిస్తున్నాడు పురుషోత్తం.

'అయన్నీ సరేలేన్నా..... ఆలోచించినాలే.. ముందు తాళిబొట్టు సరుటే చేపిద్దాంలే... మల్ల ఆలోచిద్దాం... ఎట్లయితే అట్లయితాది..." తీర్మానించినట్టు మాట్లాడాడు.

'సరేప్పా... ఊరోళ్ళంతా చీరలమీద చీరలు నేస్తాంటే, నువ్వేమో లింగులిటుకు మంటూ వారానికి రెండు చీరలు నేసుకుంటే ఏమొస్తుంది చెప్పు... పక్కనోళ్ళేమో వేలువేలు తీసుకుంటారు... నువ్వేమో ఇట్లనే ఉంటావు. అప్పుడయినా నువ్వే బాధపడాల.

ఇంకోటి ఆలోచించు. కరెంటు మగ్గం మీది చీరలు ధర కొంచెం తక్కువ. నాణ్యం ఎక్కువ. కొనుగోలు చేసే ఆసాములు కూడా ఆ చీరలే కావాలంటారు గాని, మగ్గం మీద చీరలకోసం రారేమో...! ఇప్పుడు తక్కువ రేటుకే చెవులాగుతుంది గాని... ఎక్కువ రేటుకు ఎందుకు కొంటాం చెప్పు.

నీవైపునుంచి కూడా ఆలోచించినా వెంకట్రామయ్యా! ఆసాములు నా దగ్గరకొస్తే గదా నీ దగ్గర చీరలు కొంటాను. లేకుంటే నేను కూడా నీ చీరలు కొనలేనేమో... కొంత ఆలోచించు.... నీ కోసమే చెబుతుండా...."

ఏదేమయినా ముందరికాళ్ళకు బంధం పడుతోంది. ఏందో బ్రతుకు... ఎపుడూ ఇంతేనా... దీనెమ్మ జీవితం... తలొంచి తాళికట్టించుకున్న రోజునుంచి నన్ను ప్రాణానికి ప్రాణంగా చూసుకుంది. ఎన్ని కష్టాలు పడింది..? ఎన్ని నిరాశరోజుల్ని

గడిపింది...? పిల్లలకోసం ప్రాణాల్ని ఫణంగా పెట్టింది.... అట్లాంటి మనిషి కోరిన ఒకే ఒక్క కోరిక తీర్చలేకపోతున్నా. ఏం బ్రతుకో ఏమో...? ఇంతేనేమో...! బీదోళ్ళకు కలలు ఉండకూడదు. ఉన్నా అంతరంగంలోనే దాచుకోవాల్నేమో...?, ఇంకెప్పుడూ అనుకోకూడదేమో...! జరిగితే జరిగిందనుకోవాలి. లేకుంటే లేదు.

ఇంటికిపోయి ఆయమ్మితో ఏం చెప్పాల. ఇప్పుడు ఇట్ల చెప్పినాననుకో నాకు మానముండదు.



మరోవైపు.... తర్వాత వీళ్ళు నా చీరలు కొనకపోతే నా బ్రతుకెట్లా..., తిండీ తిప్పలెట్ల..? పిల్లోని సదువెట్ల... మగ్గానికి వార్పులెట్ల...' పరి పరి విధాల ఆలోచనలు అల్లుకున్నాయి వెంకట్రామయ్యను.

'సరే పురుషోత్తం... ఇంటికిపోయి ఆలోచిస్తా... కరెంటు మగ్గం ఎంతవుతుందంట....?"

'యాభైవేలు దగ్గరదగ్గర అవుతుందంట'

'యాన్నుంచి తెప్పిస్తున్నారు..."?

'ఈ ఊర్లో అందరూ అహమ్మదాబాదు నుంచే తెప్పిస్తున్నారు. నాలుగైదు మగ్గాలు ఆర్డరొస్తే, ఆన్నుంచి డైరెక్టుగా లారీ మాట్లాడుకోని తెచ్చుకోవచ్చు. లారీ బాడిగ కూడా దాంట్లోనే... నువ్వు 'ఊ' అంటే చెప్పు. కరెంటు మగ్గానికి ఆర్డరిస్తా..'' ఉత్సాహపరుస్తూ వివరాలు ఇస్తున్నాడు పురుషోత్తం.....

"ఉండు.. ఇంట్లో భాగ్యనడిగి చెబుతా' అంటూ అంగడి పట్టి, ఖాళీ సంచితో తిరుగుముఖం పట్టాడు.

తర్జన భర్జనల అనంతరం ఇద్దరి అభిప్రాయాలు ఒక కొలిక్కి వచ్చాయి. జీవితం ముఖ్యంగాని నగలు ముఖ్యంకావని సూత్రీకరించుకున్నారు. ప్రస్తుతానికే ఈ సూత్రీకరణ. కోరిక మాత్రం నిరంతర ప్రవాహంలాగే...

"పోన్లే చిన్న.. కరెంటు మగ్గంపై రోజుకు నాలుగు చీరలు నెయ్యవచ్చుంట. గట్టిగ మూన్నెళ్ళు కళ్ళు మూసుకుంటే సరుటుకు కావాల్సిన లెక్క వచ్చేస్తుంది. కరెంటు మగ్గానికి ఆర్డరిస్తాం....

ఆయన దగ్గరే మన లెక్క ఉంది. తక్కువకు ఆయన్నే వేసుకొని తెమ్మందాము. చీరలైనాక ఆ లెక్క పట్టుకొమ్మని చెబుదాం. సరేనా..." అన్నాడు భాగ్యలక్ష్మి అంగీకారం కోసం.

ఆమె కాఫీగ్లాసులు తీసుకొచ్చి లోపలికెళ్ళింది.

ఆయన పురుషోత్తం ఇంటివైపుగా వెళ్ళాడు.

◆ ◆ ◆

కరెంటు మగ్గం బాగా కుదిరింది. పన్నెండువేల అప్పు అయింది. 'కానీ అదెంత' అంటాడు.

నలభై చీరలకు ఒకే వార్పు. పది రోజులకు అయిపోతుంది. తర్వాత అచ్చు అత్తుక్కొని కొత్తవార్పు. వార్పు వార్పుకూ లెక్క జమ అవుతుంది. నెలకోసారి ఖర్చులకు మాత్రం తెచ్చుకొని, నిల్వ అక్కడే పెట్టేవాడు.

ఆరునెలల అనంతరం నిల్వ నలభైవేలు దాటింది. బంగారు ధర పెరిగింది. తాళిబొట్టు సరుటుకు యాభై వేలవుతుంది. 'ఆసామిని అడుగుదాంలే....' అనుకొని బయలుదేరాడు.

పురుషోత్తం బయటికెళ్ళాడు. ఆయన భార్య పార్వతమ్మతో మాటలు కలిపాడు వెంకట్రామయ్య.

"పిల్లోల్లు ఏమి చదువుతున్నారు – " అంది

"రంగస్వామి టౌన్లో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. ఇంకా రెండేళ్ళు చదవాలి. చిన్నది నీలవేణి.. ఈ మధ్యనే పెద్ద మనిషయ్యింది. పది దాకా చదివింది. ఇంక ఇంట్లోనే ఉంచుకున్నా.. చాల్లేక్కా మన స్థోమతకు..." అన్నాడు.

"నీలవేణి పెద్ద దయ్యిందా.. అరె మాకు చెప్పనేలేదే... పేరంటం చేసుంటావు. ఇదిగో ఈ కొత్త డ్రస్సు ఆయిమ్మికి ఇయ్యి..." అంటూ చేతికందించింది.

తనతో నలభైవేలున్నట్లు, భాగ్యలక్ష్మికి తాళిబొట్టు సరుటు చేయిస్తున్నట్లు సంతోషంగా చెప్పాడు పార్వతమ్మ అక్కతో.

'అట్లెందుకు చేయిస్తావు" అంది

ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇపుడు బిడ్డ పెద్దమనిషియ్యింది. ఇంకో మూడు నాలుగేళ్ళకయినా పెండ్లి, యత్నాలు చేయాల. అప్పటికంతా మళ్ళా నువ్వేమి సొత్తులు చేయిస్తావు.

ఇపుడు భాగ్యలక్ష్మికి ఏమి నిలిచిపోయింది. పిల్లదానికి తీస్కో. ఎవురన్నా చూడడానికి వచ్చినపుడు సొత్తులు పెట్టి చూపించచ్చు. అవే సొత్తుల్ని ఆయమ్మి పెండ్లికి కట్నంగా ఇచ్చివెయ్యొచ్చు. ఎవురన్నా చూసినా బాగుంటుంది." అంది

# ఆకుపచ్చని కన్నీరు

- అమూల్యాచందు కప్పగంతు
9059824800

కన్నీటికి రంగుండదని తెలుసు
కాని అక్కడ పచ్చని కన్నీరు కారుతోంది
సన్నగా వీస్తున్న గాలి
ఆ ఎముకల్లోంచి మట్టి వాసనను తీసుకొస్తోంది
కపాలంలోని రెండు గుంటలు
భూమికేసి అదే పనిగా చూస్తున్నాయ్..
ఆ మృతదేహం నుంచి
పురుగుమందు వాసన గుప్పుగుప్పున వస్తోంది..
అపాదమస్తకం తేరిపార చూశా..
పచ్చని పొలం బీడుగా మారిపోయింది
అన్నదాత ఆర్తనాదంతో భూమి దద్దరిల్లింది..
పచ్చని కన్నీరు కారింది...
ధాన్యం పండించే రెండు చేతులు
ఈ లోకం నుంచి నిష్క్రమించాయి..

పొలం మీద పురుగుమందు
పనిచేసిందో లేదో తెలీదు
కాని అతని మీద బాగా పనిచేసింది
ఒక అన్నదాత
వెళ్లలేక వెళ్లలేక విడిచి వెళ్లాడు

ఈ పొలాన్ని వదిలి..
ఎడ్లను వదిలి, నాగలిని వదిలి...
మనల్ని వదిలి
పచ్చని కన్నీటిని కారుస్తూ...

❋

---

'పార్వతమ్మక్క మాటలు అసౌకర్యంగా ఉన్నాయి వెంకట్రామయ్యకు. కానీ అందులో అర్థముంది అనుకున్నాడు. "నిజమే కదా!" ఎదిగిన బిడ్డకు పెట్టుకొని మనం సింగారించుకోవాల్సిన అవసరం ఉందా! అనుకున్నాడు.

వెంటనే 'ఉంది' అనుకున్నాడు కూడా...

'భాగ్యలక్ష్మి ముచ్చట ఎప్పుడు తీర్చాలి. దాని సంతోషం చూడొద్దా...!" అనుకున్నాడు.

పురుషోత్తం వచ్చాడు.

వెంకట్రామయ్య మాటల్ని విన్నాడు

పార్వతమ్మ సలహాల్నీ గమనించాడు

లోక రీతిని వెంకట్రామయ్యకు సూచించాడు.

డబ్బులు తీసుకొని ముగ్గురూ టౌనుకెళ్ళారు.

బంగారు వ్యాపారి సైతం 'పాపకు సొత్తు తీసుకొమ్మనే' సూచించాడు.

ఒక నెక్లెస్, పాపటి బిల్ల, చెంపచారలు తీసుకున్నాడు. తాళిబొట్టు సరుటు ఎంతవుతుందో అని తెలుసుకున్నాడు. 'అరవైఐదు వేలు పై మాటే' అన్నారు. ఇక గగనమే అనుకున్నాడు.

పార్వతమ్మ సూచన మేరకు భాగ్యలక్ష్మికి ఒన్గ్రాం బంగారు మెడల్లో తాళిబొట్టు సరుటు కొన్నాడు.

ఇంటికొచ్చాడు.

భర్త రాక కోసం ఎదురుచూస్తున్న భాగ్యలక్ష్మి సంతోషంగా ఎదురెళ్ళింది. సంచి అందించి వెంకట్రామయ్య అటుగా కూర్చున్నాడు. మంచినీళ్ళందించి ఆయనకు ప్రక్కగా కూర్చొని నగల్ని తెరవసాగింది.

కళ్ళు కాంతులీనుతున్నాయి.

నెక్లెస్, చెంపచారలు, పాపటిబిల్ల చూశాక 'బాగున్నాయి, పాపకు కదూ...!" అంది.

పురుషోత్తం వాళ్ళు సూచించిన విషయాల్ని, పాప భవిష్యత్తును వివరించాడు.

చివరిపొట్లం తనదేనన్న సంతోషం. మెల్లగా ఎర్రటి కాగితంలోంచి తాళిబొట్టు సరుటు తణుకులీనింది. 'అబ్బో... ఎంత బాగుందో" అంది ఆనందాన్ని పులుముకుంటూ.

వెంకట్రామయ్య ముఖంలో ఏ భావమూ ప్రస్ఫుటంగా కనిపించలేదు.

అంతే.....

*(అనంతపురం జిల్లా సాహితీస్రవంతి నిర్వహించిన కథలో పోటీలో పిళ్ళా లక్ష్మారెడ్డి - పిళ్ళా రామలక్ష్మి స్మారక పురస్కారం పొందిన కథ)*

❋

# అక్షరదీక్షా దక్షుడు అనువాద సముద్రుడు

- తెలకపల్లి రవి

*ఆయన కేవలం రచయిత మాత్రమే కాదు, నిపుణత, నిబద్ధత మేళవించిన నిరంతర విజ్ఞాన తపస్వి. బహుభాషా పరిజ్ఞానం బహుగ్రంధ రచన తర్వాత కూడా ఆఖరివరకూ అతి సామాన్యంగా, జీవితం గడిపిన ఆశయధనుడు. దక్షిణాదిన ప్రధాన భాషలైన తెలుగు తమిళంతో పాటు ఉత్తరాదికి పర్యాయపదమైన హిందీని ఔపోసన పట్టి అటూ ఇటూ అనువాదాలు గుప్పించి వదలిన సవ్యసాచి. సత్యజీవి.*



*తిరుపతిలో 2011 నవంబర్ 2న ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహనరావు కు చిన్నప్ప భారతి పురస్కార అందించిన సభలో ప్రసంగిస్తున్న ఎ.జి. యతిరాజులు.*

నీవు రచయితగా వుండదల్చుకుంటే సైనిక శిక్షణ నేర్చుకోమంటాడు రస్కిన్ బాండ్. సమావేశాలు సన్నద్ధత పెంచుతాయి. చదవడం విషయ పరిజ్ఞానం కలిగిస్తుంది. రాయడం పరిపూర్ణత నిస్తుంది అన్నది మరో ప్రసిద్ధ సూక్తి. ఇవన్నీ కలిపి చూస్తే కళ్లముందు సాక్షాత్కరించే సాహిత్యశిఖరం అక్షర సముద్రం ఎజియతిరాజులు. ఎనభై నాలుగేళ్ల పూర్ణ జీవితం గడిపి ఫిబ్రవరి23న కన్నుమూసిన ఆయన కేవలం రచయిత మాత్రమే కాదు, నిపుణత, నిబద్ధత మేళవించిన నిరంతర విజ్ఞాన తపస్వి. బహుభాషా పరిజ్ఞానం బహుగ్రంధ రచన తర్వాత కూడా ఆఖరివరకూ అతి సామాన్యంగా, జీవితం గడిపిన ఆశయధనుడు. దక్షిణాదిన ప్రధాన భాషలైన తెలుగు తమిళంతో పాటు ఉత్తరాదికి పర్యాయపదమైన హిందీని ఔపోసన పట్టి అటూ ఇటూ అనువాదాలు గుప్పించి వదలిన సవ్యసాచి. సత్యజీవి. ఇంతటి అపార రచనా వ్యాసంగంలోనూ తన జీవిక కోసం గౌరవ ప్రదమై ఉపాధ్యాయ వృత్తినీ అంతే శ్రద్ధగా నిర్వహించిన బాధ్యతాయు వ్యక్తి. ఆ విధంగా చూస్తే యతిరాజులుతో పోల్చదగి అనువాదకుడు అన్ని గ్రంధాలు అంత పరిణామంల చేసినవారు మరొకరు లేరని ఘంటాపథంగా చెప్పొచ్చు. హిం నుంచో ఇంగ్లీషు నుంచో చాలా చేసిన వారున్నారు గాని తమిళ నుంచి తెలుగులోకి తెలుగునుంచి తమిళంలోకి ఒక్కచే మీదుగా అన్ని పుస్తకాలు తీసుకొచ్చిన వారు మరిలేరు అందులోనూ అన్నీ ప్రామాణిక గ్రంధాలు ప్రయోజనాత్మకమైనవీ మాత్రమే. ఇంత కృషి చేసి యతిరాజులు మృతి వల్ల ఏర్పడిన లోటును భర్తీ చేయడ దాదాపు అసాధ్యం. ఎందుకంటే ఇక్కడ రచనా శక్తి భాషాపరిజ్ఞానం మాత్రమే చాలదు – అంతకు మించిన అంకి భావం కావాలి. అక్షరదీక్ష వుండాలి. మంచి విషయాల

ాఠకులకు అందించాలనే తపన ెంటాడాలి. సంకల్పానికి తగినట్టు శ్రమించగల వోర్పు, అనుకున్నదానికి ్యాయం చేయగల నేర్పు వుండాలి. ాటిని రాసిన వారితో వేసే వారితో సమన్వయం చేసుకోవడంలో సమస్యలను భరించాలి. ఉద్యోగం ేసుకుంటున్నప్పుడు ఒక విధంగా ిరమణ తర్వాత మరో విధంగా కుటుంబ బాధ్యతలు అవసరాలు చూస్తుండాలి. యతిరాజులు నిజంగానే నాలుగు ేతులలతో నిండైన ఒక చైతన్య హృదయంతో ఇవన్నీ చేసి ఫుండకపోతే మనకు తెలుగువాళ్లకు అనేక అవగాహనాత్మక ్రంధాలు అందివుండేవి కావు.

జాతీయ విప్లవకారులైన భగత్ సింగ్ వంటివారి ఉత్తేజకర జీవితం తెలియడానికి ఆయన చేసిన శివవర్మ సంస్మృతులు ఉత్తేజమిచ్చాయి. మహాపండితుడైన రాహుల్ సాంకృత్యాయన్ సమాజంపై రాసిన ధారావాహికనూ వెలవరించారు.

**ఠోర జీవితానుభవాలతో కమ్యూనిస్టుగా..**

ఇంతా చేసి యతిరాజులు ఏదో విద్యావంతుల ుటుంబంలోనో సంపన్న వాతావరణంలో పుట్టలేదు ఆంధ్ర ప్రదేశ్ సరిహద్దులోని గుడియాత్తం అనే తమిళగ్రామంలో 1935లో ఒక పేద చేనేత కుటుంబంలో పుట్టారు. తిండిగింజల ోసం కూడా ఎంతో అవస్థ పడ్డారు. అరకిలో గింజల కోసం ోజు మొత్తం క్యూలో పడిగాపులు కాసిన పరిస్థితి ఆయనలో ైతన్యం పాదుకొల్పింది. యుద్ధం, అణచివేత, పీడన చూసి ిగిలిపోయారు. ఆ ఆలోచన కమ్యూనిస్టు ఉద్యమం వైపు ిడిపింది. 15వ ఏటనే ఎర్రజండా వైపు ఆకర్షితుడైన యతిరాజులు మరో ఏడు దశాబ్దాలు ఆ బాటనే నడిచారు. ిత్తూరు జిల్లాలో హిందీ పండిట్‌గా పనిచేశారు. సరిహద్దు ాంతాల్లో తెలుగు తమిళ భాషలు వచ్చేవారుంటారు గాని ిందీ ఆయనకు అదనపు బలమైంది. మూడు భాషలు వచ్చాక ంస్కృతం తెలుసుకోవడం సులభమై పోయింది. ఇంగ్లీషు ిరిచయం వుండనే వుంది. ఆ విధంగా ఈ బడిపంతులు ిహుభాషానువాదకుడైనాడు.

**ిపురూప గ్రంథ మాలిక**

మొదట్లో అరుణానంద్ పేరిట యతిరాజులు ఇఎంఎస్ ంబూద్రిపాద్ 'భారతదేశ చరిత్ర' వేదభూమి పుస్తకాలు ిమిళం నుంచి తెలుగు చేశారు. నంబూద్రిపాద్ ఇంగ్లీషులో ియితిరిగిన వారైనా మళయాలంలో చాలా రాస్తుండేవారు. తమిళ మళయాల భాషలు రెండూ వచ్చిన వారు వాటిని వెంటనే అనువదించే వారు. యతిరాజులు తమిళంలో వాటిని చదివి తెలుగు చేశారు. తద్వారా ఆయన కృషి నంబూద్రిపాద్‌ను కూడా ఆకర్షించింది. అందుకే చిన్నప్ప భారతి 'సంఘం' తమిళ నవలను ఆయన తెలుగీకరించినప్పుడు నంబూద్రిపాద్ ముందుమాట రాశారు. చిన్నప్ప భారతి రచనలు 90వ దశకంలో పాఠకులను ఎంతగానో ఆకర్షించాయి. దాహం, చక్కెర నవలలు, ఆమె సారథి అనే కథాసంపుటి కూడా అనువదించారు. జాతీయ విప్లవకారులైన భగత్ సింగ్ వంటివారి ఉత్తేజకర జీవితం తెలియడానికి ఆయన చేసిన శివవర్మ సంస్మృతులు ఉత్తేజమిచ్చాయి. మహాపండితుడైన రాహుల్ సాంకృత్యాయన్ సమాజంపై రాసిన ధారావాహికనూ వెలవరించారు. అనువాదాలని తెలియకుండా చదివించేట్టు రాయడానికి ఆయనకు ఉభయ భాషలపై పట్టు వుండటంతో పాటు ప్రజా జీవన రీతులు అలవాట్లు ఆచారాలు తెలియడం దోహదపడింది.

పదవీ విరమణ తర్వాత ఆయన స్వచ్ఛందంగా ప్రజాశక్తి బుక్‌హౌస్‌కోసం నిరంతరం అనువాదాలు చేయడానికి ముందుకొచ్చారు. ఒక్క ఆపరేటర్‌ను మాత్రం ఏర్పాటు చేస్తే చాలన్నారు. విద్యారంగంతో పెనవేసుకున్న యతిరాజులు బాలల గురించి బడిచదువుల గురించి గిజుబాయి రాసిన అద్భుత రచనలను ఆరు సంపుటాలుగా అనువదించారు. అంతకుముందు ఒకటిఅరా మాత్రమే తెలుగులో వుండేవి. గిజుభాయిని హిందీ నుంచి తెలుగులోకి తెచ్చేప్పుడు నడక ఎంతమాత్రం దెబ్బతినకుండా ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఈ పుస్తకం లక్షల కాపీలు తెలుగు నాట అన్ని చోట్లా పాఠశాలలకు చేరింది. అధ్యయనశీలులైన ఉపాధ్యాయులకు కరదీపికగా మారింది.

**నిరంతర తపన..నిర్విరామ సృజన**

2000 సంవత్సరం తర్వాత తమిళనాడులో భారతి పుస్తక కేంద్రం స్థాపించాక వివిధ సమకాలీన విషయాలపై చిన్న చిన్న పుస్తకాలు వందల సంఖ్యలో ప్రచురించి విస్తారంగా విక్రయించారు. మేము చెన్నై నుంచి వారి క్యాటలాగు తెప్పించి

యతిరాజులుకు పంపించడం, వాటిలో విషయాన్ని ఆయన సంగ్రహంగా రాయడం ఎంపిక చేసినవి అనువదించడం మరో ఘట్టం. ఆ క్రమంలో స్త్రీ విముక్తి, అలెగ్జాండర్, మూఢ నమ్మకాలు తదితర పుస్తకాలతో పాటు పెరియార్ రచనలు కూడా అనువదించారు. యతిరాజులు వాటిని చక్కగా డిటిపి చేయించి పంపితే ఒకసారి చూసి ముద్రించడమే. ఈ విధంగానూ ఆయన కొన్ని డజన్ల పుస్తకాలు తెలుగులోకి తెచ్చారు. విశేషమేమంటే ఇవన్నీ రకరకాల రంగాలకు సంబంధించినవి. సైన్సు, చరిత్ర, సమాజం మతం వంటి వివిధ కోణాలతో వున్నా అన్నిటినీ ఒకే సమర్థతతో ఒకే సులువుతో ఆయన అనువదించారు. ఎప్పుడైనా ఏదైనా పదం కొంత పొసగలేదనిపిస్తే ముందే దృష్టికి తెచ్చి ఏదో ఒకటి ఖాయం చేయమని చెప్పేవారు. మామూలుగా రచనలు అనువాదాలు చేసేవారికి నిరంతరం వెంటపడి గుర్తు చేస్తుండాలి. అయినా ఆలస్యమవుతుంటుంది. కాని యతిరాజులు విషయంలో ఇది తలకిందులు. ఆయనే అనువాదం పంపించి ఎప్పుడు వస్తుందని అడుగుతుండే పరిస్థితి! అంత వేగం. అంతే పట్టుదల. ఆయనలో ఒక ప్రత్యేకత ఏమంటే మూలం ఏ భాషలో వున్నా తెలుగు తమిళ హిందీలలో దాని అనువాదం వున్నా సరే మరో భాషవారికి చేరుస్తారు. అలెక్స్ హేలీ ఏడుతరాలు, హొవర్డ్ ఫాస్ట్ స్పార్టకస్, ప్రకాశ్ సాంజ్‌గిరి మనిషి కథ అలాగే చేశారు.

*ఆయన కొన్ని డజన్ల పుస్తకాలు తెలుగులోకి తెచ్చారు. విశేషమేమంటే ఇవన్నీ రకరకాల రంగాలకు సంబంధించినవి. సైన్సు, చరిత్ర, సమాజం మతం వంటి వివిధ కోణాలతో వున్నా అన్నిటినీ ఒకే సమర్థతతో ఒకే సులువుతో ఆయన అనువదించారు.*

**సవ్యసాచి సజీవ స్రవంతి**

మనకు తెలుగులోకి వచ్చినవే తెలుసు గాని ఇంతే స్థాయిలో ఆయన తమిళంలోకి తెలుగు పుస్తకాలు తీసుకువెళ్లారు. సుందరయ్య, అమీర్ హైదర్‌ఖాన్, మేజర్ జైపాల్‌సింగ్ ఆత్మకథలూ, వీర తెలంగాణ విప్లవ పోరాటం తమిళులకు అందజేశారు. శ్రీశ్రీ, ఆరుద్ర కవితలు కూడా అనువదించారు. ఇక తెలుగు సాహిత్యంలో బాగా పేరు తెచ్చుకున్న పుస్తకాలు – కేశవరెడ్డి అతను అడవిని జయించాడు. కళ్యాణరావు అంటరాని వసంతం తమిళంలోకి తీసుకెళ్లారు. అంటరాని వసంతం మూడు ముద్రణలు పొందగా మిగిలిన రచనలు కూడా చాలా ఆదరణ పాత్రమైనాయి. ఆయన పుస్తకాల జాబితానే ఇంత పెద్దగా వుంటే ఇక వాటిని రాయడంలో శక్తియుక్తుల గురించి ఎంత చెప్పాలి? ఎప్పటికప్పుడు ఏం అనువాదం చేద్దామా అని ఆలోచించడం తప్ప మరో ధ్యాస ఆయనకు వుండేది కాదు. అదే సమయంలో గొప్ప చదువరి కూడా. ప్రజాశక్తిలో లేదా ప్రస్థానంలో ఏదైనా మంచి రచన, వ్యాసం వచ్చిందంటే వెంటనే స్పందించేవారు. ఎవరు మంచి పుస్తకం రాసినా ఫోన్ చేసి అభినందించేవారు. ఇంత తీరుబడిలేని రచనా వ్యాసంగంలోనూ ఆయన ఉద్యమ సంబంధమైన సభలూ సమావేశాలకూ సాహిత్య సమ్మేళనాలకు తప్పక హాజరై అందరితో కలసి మెలసి తిరిగేవారు. అందుకే అంత సజీవంగా వుండగలిగారు. ఈ రచనా వ్యాసంగంలో ఆయన ఎప్పుడూ ఎలాటి ప్రతిఫలం ఆశించలేదు! పైగా ఆ కాలమంతటా యుటిఎఫ్‌లోనూ జనవిజ్ఞాన వేదికలోనూ సాహితీ స్రవంతితోనూ పనిచేస్తూనే వున్నారు. స్థానికంగానే గాక తమిళనాడులో అభ్యుదయసాహిత్య సందర్భాలన్నిటిలోనూ పాలు పంచుకుంటూ ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ వచ్చారు. ఆ విధంగా ఆయన భాషల మధ్య తరాల మధ్య వారధి అయ్యారు.

కొద్దిపాటి రచనలు చేయగానే ఆపసోపాలు పడటం పరిపాటిగా వుండే నేపథ్యంలో ఇంత విస్తారమైన కృషికి గాను ఆయనకు కొన్ని పురస్కారాలు సత్కారాలు అందినమాట నిజమే గాని చాలా పరిమితమైనవి. ఎందుకంటే ఆయన ఎప్పుడూ వాటికోసం పాకులాడలేదు. సుదీర్ఘకాలం రచనా వ్యాసంగం సాగించిన యతిరాజులు అనారోగ్యంతో పెనుగులాడుతూనే అధ్యయనం సాగించారు. అన్ని అంశాలపైనా స్పందనలు పంచుకుంటూనే వచ్చారు. ఆయన అందించిన అక్షర సంపదను సద్వినియోగం చేసుకుంటూ ఆ బాటలో ఆ క్రమశిక్షణనూ శ్రమశిక్షణనూ అనుసరించడం అందరికీ ఆదర్శం కావాలి. ఆయన కుటుంబానికి ఇదే ప్రగాఢ సానుభూతి. ఆయనకు అక్షర జోహార్లు.

❋

# వలస



- వాయుగుండ్ల శశి కళ

నల్ల మబ్బుల గూటిలో మెరుపు దీపం వెలుగగానే
ఉరుముల బాజాలు మోగుతాయి
చల్లటి గాలి వింజామరాలతో సేదతీరుతూ
వేల మైళ్ళ ప్రయాణ బడలికని మరచి
విచ్చేస్తాయి దేవతా పక్షులు

వానవిల్లు కింద
చినుకుల ముత్యాలు వెదజల్లుతూ
దూరదేశాల అతిధులు
మార్గశిరం లో రెక్కల బారులతో
చక్కని ముగ్గులు గీస్తూ
విడిదింట్లో చెట్లకి రెక్కల గొడుగులు కప్పుతాయి

నేలపట్టు వెదురు పట్టు వాటికి ఆటపట్టు అయి
పులికాట్ ఇప్పుడు ఎర్ర కాళ్ళ పూలను పూస్తుంది
విప్పిన రెక్కలాగానో
చేస్తున్న జపం లాగానో
వయ్యారపు నడకలోనో
అప్పుడే పుట్టిన
చిన్ని పిట్టల ఊసులతోనో
పురిటి జాతర సందడి

నామకరణాలు చెయ్యవేమో కానీ
కేరింతలు గు గు లు
పెలికాన్ దవడ లోని చేపలతో
చిన్ని కూనలకు ఇక్కడే అన్న ప్రాసన

ఫ్లెమింగో కళ్ళలో పులికాట్ ఇప్పుడు
తన సొగసును చూసుకుంటూ ఉంది
ఇప్పుడు కదా మనకు వేయి కళ్ళు కావాలి
లక్షల బ్రతుకు చిత్రాల రంగులు
మనసున పూయించుకోవడానికి
ఆ చిన్ని పిట్టల్లో మనం పిల్లతనం లోకి దూకడానికి

ఏమిటో వలస పక్షులంటాము కాని
అవి ఇక్కడే పుట్టి
మన పౌరసత్వం పొందిన మన పిల్లలే కదా !!

# ఆధునిక కవిత్వానికి వన్నె తెచ్చిన 'గీటురాళ్ళు'




- టేకుమళ్ళ వెంకటప్పయ్య
9490400858

*డా. అద్దేపల్లి వందలాది కవితా సంపుటులకు రాసిన ముందుమాటలు, భావితరాల కవులకు మార్గదర్శక సూత్రాలుగా నిలిచిపోయాయి. కవిత్వం విషయంలో తొలి అడుగులు వేస్తున్న వర్ధమాన కవులను ఆప్యాయంగా దగ్గరకు పిలిచి వారి కవిత్వంలోని గుణగణాలను విప్పిచెప్పి తగు సలహాలనిచ్చి ప్రోత్సహించడంలో ఆయన ముందుండేవారు. అలా ఆయన చిన్నా పెద్దా అనే తారతమ్యం లేకుండా రాసిన అనేక కవిత్వ సంపుటుల సమీక్షలు "గీటురాయి" పేరుతో నాలుగు సంపుటాలుగా వెలువడ్డాయి.*

ఒక గృహానికి ద్వారం ఎటువంటిదో, పుస్తకానికి ముఖచిత్రం అటువంటిది. ముఖచిత్రం చూసి ఆ పుస్తకాన్ని ఆప్యాయంగా తెరుస్తాము. మొదటగా ఉన్న ముందుమాట హృద్యంగా ఉంటేనే ఆ పుస్తకం పాఠకుడిని ఆసాంతం చదివిస్తుంది. పుస్తకం పట్ల ఒక సదభిప్రాయాన్ని కలిగిస్తుంది. అందుకనే కవులు తమ కవితా సంపుటులకు, గ్రంధాలకు ముందు మాటలు రాయమని సహృదయులైన విమర్శకులనూ, లబ్ధప్రతిష్ఠులైన కవులను ఆశ్రయిస్తూ ఉంటారు.

డా. అద్దేపల్లి వందలాది కవితా సంపుటులకు రాసిన ముందుమాటలు, భావితరాల కవులకు మార్గదర్శక సూత్రాలుగా నిలిచిపోయాయి. కవిత్వం విషయంలో తొలి అడుగులు వేస్తున్న వర్ధమాన కవులను ఆప్యాయంగా దగ్గరకు పిలిచి వారి కవిత్వంలోని గుణగణాలను విప్పిచెప్పి తగు సలహాలనిచ్చి ప్రోత్సహించడంలో ఆయన ముందుండేవారు. అలా ఆయన చిన్నా పెద్దా అనే తారతమ్యం లేకుండా రాసిన అనేక కవిత్వ సంపుటుల సమీక్షలు "గీటురాయి" పేరుతో నాలుగు సంపుటాలుగా వెలువడ్డాయి. కొందరు గొప్పగొప్ప బిరుదులు, పురస్కారాలు పొందినవారు, ముందుమాట రాయమని అడిగే వర్ధమాన కవులను నెలల తరబడి తిప్పుకోవడం, మొక్కుబడిగా నాలుగు మాటలు రాసి ఇవ్వడం, వారిని నిరాశ పరచడం మనకు తెలుసు. డా. అద్దేపల్లి ఎప్పుడూ కవులను నిరాశపరిచే వారు కాదు. వారం లోపుగానే ఇచ్చి సంతోషపెట్టే వారు. కొన్ని అక్కడికక్కడే ఒక గంట, రెండు గంటల సమయంలో రాసియిచ్చిన సందర్భాలు అనేకం. కవిత్వమూ జీవితమూ వేరుకాదు అని నమ్మే వ్యక్తిగా డా. అద్దేపల్లి సుప్రసిద్ధులు. కవి వ్యక్తిత్వంతో ఆ కవి తత్త్వాన్ని, కవిత్వాన్ని కూడా తూచగల ధీమంతుడు.

"సృజన గరిమ - విమర్శన ధృఢిమ - వక్తృత్వ పటిమ ముప్పేటలుగా అల్లుకున్న సాహితీ మూర్తి డా. అద్దేపల్లి రామమోహనరావు" అని జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డి అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. డా. అద్దేపల్లి తన సుదీర్ఘ సాహితీ ప్రస్థానంలో ముప్పైకి పైచిలుకు పుస్తకాలను రచించి, వందల ముందు మాటలు రాసి, అనేక సాహితీ సభల్లో వేల ఉపన్యాసాలు ఇచ్చి, ఎన్నో వందల పుస్తకాలను సమీక్షించి, తెలుగు సాహితీలోకంలో ఒక కవిత్వ యోధునిగా, సంచార సాహితీ

మూర్తిగా జీవించిన డా. అద్దేపల్లిని గూర్చి ఈనాటి తరం తెలుసుకోవలసినది ఎంతో ఉంది. ఆ "గీటురాళ్ళు" ఆధునిక కవిత్వానికే వన్నె తెచ్చాయని చెప్పవచ్చు. అలాంటి ఉన్నతశ్రేణికి చెందిన కవి రాసిన గీటురాళ్ళలో కొన్నింటిని పరిశీలించి భావితరాలకు అందజేయడం మన బాధ్యత, కర్తవ్యం.

*బేధం వివరిస్తూ "హైకూ సామాజిక అంశంగా మారేసరికి మినీ కవితతో పోలిక వచ్చింది. అయితే ఒక ముఖ్య బేధం ఉంది. మినీ కవితకి "శీర్షిక" ప్రాధాన్యం ఉంది. అంతే గాక 'కొసమెరుపు' చాలా ముఖ్యం. సామాజిక హైకూల్లో వీటి ప్రాధాన్యం కనిపించదు. వ్యంగ్యం ఉండవచ్చు లేదా ధ్వనితో చెప్పవచ్చు" అంటారు.*

లంకా వెంకటేశ్వర్లు రచించిన "ఆకాశం నేలపాలయింది" హైకూల సంపుటిని సమీక్షిస్తూ హైకూలకు కొత్త కొత్త వివరణలనిస్తూ.. కొంగ్రొత్త కోణంలో వీక్షించారు డా. అద్దేపల్లి. "ఆకాశాన్ని నేలపైకి తెచ్చే హైకూ" అనే పేర 2002 సంవత్సరంలో ముందు మాట రాశారు. డా. అద్దేపల్లి హైకూలను సూక్ష్మంగా వస్తుకాయిదం పడుతూ.. *"హైకూ సమయం, హైకూ సందర్భం, హైకూ జీవితం – అనే మూడు ముఖ్యమైన అంశాలు, హైకూ రచనకు నేపథ్యంలో ఉన్నై. ఒక సమయంలో మనస్సు లోక వ్యవహారాల బరువునుంచీ కొన్ని క్షణాలు లోపలికి గుంజుకుని, లోలోపలికి స్వచ్ఛత వైపుకి ప్రయాణం చేస్తుంది. అదే 'హైకూ సమయం'. పై పై ముద్రలన్నీ తుడిచి వేసినప్పుడు, కదలిక లేని చెరువులో కనిపించే ఆకాశంలాగా, అనుభూతి మెరిసిపోతుంది. ఇలాంటి సమయం ప్రతివ్యక్తికీ నిత్య జీవితంలో చాలా అరుదుగా లభిస్తుంది. గొప్ప స్పందనలనిచ్చే ప్రకృతిని ఏకాగ్రంగా అనుభవించడం, లోతైన అనుభూతుల్ని గుండెల్లోంచి తోడే వాతావరణంలో నిమగ్నం కావడం వంటివి 'హైకూ సందర్భం. ఇక హైకూ జీవితమనేది, ఎప్పుడూ సౌందర్య లోకాల్లోనే ఉండడానికి తగిన ధ్యాన జీవితం"* అంటారు. జెన్ తత్వాన్ని పరిశీలించిన డా. అద్దేపల్లి ఎప్పుడూ సౌందర్య లోకంలో విహరించే హైకూ రాను రాను సామాజిక జీవితంలోకి ప్రవేశించిందంటారు. భారతీయ సామాజిక విలువలను విప్పిచెప్పాలంటూ, ప్రగతిశీల సమాజాన్ని ఆకాంక్షిస్తారు. హైకూ దృశ్యంలోని ప్రత్యేకతని వెంటనే పట్టుకోవడం, కవి చెప్పిన అనుభూతి గుండెకు హత్తుకోవడం ప్రాణం అంటారు. మినీ కవిత, హైకూకు బేధం లేదనుకునే వారికి బేధం వివరిస్తూ *"హైకూ సామాజిక అంశంగా మారేసరికి మినీ కవితతో పోలిక వచ్చింది. అయితే ఒక ముఖ్య బేధం ఉంది. మినీ కవితకి "శీర్షిక" ప్రాధాన్యం ఉంది. అంతే గాక 'కొసమెరుపు' చాలా ముఖ్యం. సామాజిక హైకూల్లో వీటి ప్రాధాన్యం కనిపించదు. వ్యంగ్యం ఉండవచ్చు లేదా ధ్వనితో చెప్పవచ్చు"* అంటారు. ఈ సందర్భంగా ఉదాహరణలతో "హైకూ" కవితారూపం యొక్క రంగు, రుచి, వాసనానుభూతులను మనకు సాక్షాత్కరింప జేశారు.

జి. సుబ్బారావు రాసిన "బియ్యపు గింజ" కవితా సంపుటిని సమీక్షిస్తూ.. *'కృత్రిమ సంస్కృతిని దాటి, మౌలికమైన, సహజమైన, ప్రాకృతికమైన, మనిషి మనుగడలోని సామరస్యం మీద కేంద్రీకృతమైన దృష్టినివ్వడానికి ఈనాటి కవులు ప్రయత్నం చేస్తున్నారని చెప్తూ, పునాదిలోని భావాల మీద దృష్టిని మళ్ళించుకునే ఒక ప్రాకృతికమైన అలోచనకు ప్రతీక జి. సుబ్బారావు కవితా సంపుటి వడ్ల గింజ.'* అంటారు. ఆయన దృష్టి సదా సామాజిక భీభత్సం మీద, సమకాలీన కృత్రిమత్వం మీద తద్వారా పెరుగుతున్న హింస, అసమానతలూ, ప్రేమ రాహిత్యమూ, తదనుగుణ అన్యాయాలపై ఉంటుంది. ఆయన రచనలు సాధారణంగా ఆ వస్తువుల చుట్టూ తిరుగుతూ ఉండేవి. బియ్యపు గింజ శీర్షికతో ఉన్న కవితలో కవి "దళిత అమ్మను" గురించి చెప్పడం ప్రస్తావిస్తూ దళిత కవిత్వంలో ఒక కొత్త వస్తువు ముందుకొచ్చిందంటాడు అద్దేపల్లి. రైతు కూలీ అయిన అమ్మతోడి అనుబంధానికి కొత్త నిర్వచనం అనీ, ఆ ప్రేమలోని ఔన్నత్యాన్ని ప్రతిఫలించినదని కితాబిచ్చారు. ఎంత సూక్ష్మ పరిశీలన ఉంటేే తప్ప ఇలాంటి అలోచనలు, అనుభూతులు ఒక విమర్శకునిలో ఉత్పన్నమౌతాయి?

యస్.ఆర్.పృధ్వి రాసిన "గుండె గాయాలు" అనే కవితా సంపుటి సమీక్షిస్తూ "కవిత్వమే ఒక పెద్ద గాయం" అనే ముందుమాటలో ఉత్తమ కవిత్వావాహనకు ఉండవలసిన ప్రధాన అంశాలను గురించి చెప్తారు. "ఉత్తమ కవిత్వానికి హృదయం, అవగాహన రెండూ ప్రధానాంశాలే!" అంటూ 'సామాజిక సిద్ధాంతాల వివేకంలోనుండి అవగాహన వస్తుందని, ఆర్ధ్రమైన అనుభూతుల్లోనుంచీ హృదయావిష్కరణ జరుగుతుందని చెప్తూ, హృదయావిషకరణ ఎంత బలంగా ఉంటే అంత ఉత్తమ కవిత్వం జాలువారుతుందని' చెప్తారు. ఇవి వర్ధమాన కవుల కవిత్వావాహనకు ఉపకరించే మాటలు.

*మినీ కవితల్లో ఉన్న కొద్ది పాదాల్లో సమతూకం ముఖ్య లక్షణమనీ, ఆ పాదాల్లో భావ ముద్రణ జరగాలనీ, చివరి పాదాల్లో కనిపించే సామ్యం కూడా భావస్ఫురణకు దోహదం చేసి తీరాలని చెప్తారు.*

"అక్షరాల్తో అంటిస్తే 'భావాలతో' రాజుకునే నెగళ్ళు" అన్న శీర్షికన చింతాడ రామారావు రాసిన నెగళ్ళు అనే కవితా సంపుటిని సమీక్షించిన అద్దేపల్లి "సమాజంలో సర్వరంగాలనూ ఆవరించిన వ్యాపార దృక్పథం ఈనాడు సంస్కృతిని కూడా శాసిస్తోంది. భారతదేశం సంస్కృతిపట్ల తనతనాన్ని కూడా కోల్పోయే ప్రమాదంలో పడిందని చెప్తూ ఈ నేపథ్యంలో కవిత్వం ఎలాంటి సామాజిక బాధ్యత తీసుకోవాలో వివరిస్తారు. ప్రజా కవిత్వానికి నూతన కోణాల్ని యువ రచయితలు కల్పించడం పట్ల హర్షం వ్యక్తం చేస్తూ "కవిత్వం ఆగ్రహం, నిగ్రహాన్ని కూడా కలుపుకుని, జీవితపు వేళ్ళను తడుపుకునే ప్రయత్నం చేస్తున్నది. ప్రతిఘటనకు అన్ని రసాలను సమ్మిళితం చేస్తోంది" అంటారు. ఇంకా " ఈనాడు లోతైన కవిత్వం చెప్పగలవారెవరంటే, తమ వేళ్ళకోసం అన్వేషించగలవారే, 'వేళ్ళ వెలుగులో సమాజాన్ని, సామ్రాజ్య వాదాన్ని, వర్గ స్పృహతో వ్యాఖ్యానించగలవారే!" అని సంస్కృతిపట్ల తనకు గల నిబద్ధతను నిష్కర్షగా చెప్తారు అద్దేపల్లి.

"ఈనాడు సామాజిక చైతన్యంతో కవిత్వాన్ని రాస్తున్న వారు అసంఖ్యాకంగా ఉన్నారు. అందులో అనేకమందికి సామాజికవేదన ఉన్నంతగా అభివ్యక్తి గాఢత ఉండదు. అందుకే సామాజిక కవిత్వం పలచబడిపోయి, నినాదాల స్థాయికి దిగజారిందనే విమర్శ వినపడుతూ ఉంటుంది. అభివ్యక్తి ఉన్న కవి మాత్రమే, తన సామాజిక భావాలకి ప్రజల గుండెల మీద ముద్ర పడే ఉన్నత ప్రయోజనాన్ని సాధించగలడు" అంటారు డా. అద్దేపల్లి. జి.సత్యనారాయణ ''అలజడి'' కవితా సంపుటి ముందుమాటల్లో "హృదయాన్ని కదిలించే కవితల అలల జడి" అన్న శీర్షికన. మనం ఇక్కడ గమనించ వలసిన విషయం కవిత్వం లో అభివ్యక్తి ప్రాణం, అది లోపిస్తే కవిత నిస్సారమయి నీరసరసాన్ని పంచుతుంది.

పి.అనంతరావు రాసిన "జనకేతనం" అన్న కవితా సంపుటి సమీక్షిస్తూ అభ్యుదయ కవిత్వం పరిధిని, నిబద్ధతలను గురించి చెప్తారు. "అభ్యుదయ కవిత్వానికి ఒక నిర్దిష్టమైన పరిధి ఉంది. ఆ పరిధిలోకి వచ్చే ప్రధాన అంశాలు 1. వర్గ సంఘర్షణ 2. శ్రమ దోపిడి 3. బూర్జువా సంస్కృతి 4.సంస్కరణ భావాలు 5. సమాజం తప్పక మారుతుందనే ఆశా వాదం 6. వక్ర రాజకీయాల ఖండన. వీటికి అనుబంధంగా మరెన్నో భావాలు ఉండవచ్చు గానీ, పైవి పరిధికి సంబంధించిన అంచుల్ని నిర్ణయిస్తై. ఆ పరిధిలో రాసినవారే అభ్యుదయ కవులు ఔతారు. అభ్యుదయ కవిత్వాన్ని రాస్తాననే వ్యక్తి, ప్రేమ కవిత్వాన్ని ఫ్యూడల్ భావాలను ప్రశంసించే కవిత్వాన్ని కూడా రాస్తూ ఉంటే ఆ కవికి నిబద్ధత లేదని అర్థం." అంటారు. ఒక వాదానికి కట్టుబడి ఉన్నామని చెప్పే వాళ్ళ గురించి చెప్పే మాటలే ఇవి. అంటే "నిబద్ధత" గురించి మాత్రమే ఇక్కడ డా. అద్దేపల్లి ప్రస్తావిస్తున్నారని తెలుసుకోవాలి.

ఏ కవిత్వమైనా విపరీతంగా ప్రచలితమైన దశ సన్నగిల్లిన తర్వాత కూడా ఆ రూపం కవితా రంగం నుండి తొలిగిపోలేదు అంటారు మిని కవిత్వాన్ని గూర్చి చెప్తూ డా. అద్దేపల్లి. సోమేపల్లి వెంకట సుబ్బయ్య రాసిన "లోయలో మనిషి" మినీ కవితా సంపుటి సమీక్షిస్తూ "మనిషికి ప్రతిధ్వని" అన్న శీర్షికన మినీ కవితల్లో ఉన్న కొద్ది పాదాల్లో సమతూకం ముఖ్యలక్షణమనీ, ఆ పాదాల్లో భావ ముద్రణ జరగాలనీ, చివరి పాదాల్లో కనిపించే సామ్యం కూడా భావస్ఫురణకు దోహదం చేసి తీరాలని చెప్తారు. శబ్ద లయ, ప్రాస, అనుప్రాసలుంటే సరిపోదని చెప్తారు. ఒక కవికి పునాదిగా ఉండే భావాలలో ఎంత ఔచిత్యం ఉన్నా నిరంతర కృషి, అధ్యయనం, వాటి పరిధిని విస్తృతం చేస్తై అని చెప్పారు. నేటి వర్ధమాన కవులు నిరంతరం సమాజాన్ని అధ్యయనం చెయ్యాలనీ ఆ స్ఫూర్తితో ఉత్తమ కవిత్వం వెలయించగలరని సందేశం ఇచ్చారు డా. అద్దేపల్లి.

అలాగే డా. ఎల్.కె. సుధాకర్ రాసిన "కొబ్బరాకు" గురించి రాస్తూ కవిత్వంలో సౌందర్య భావనలకీ, ప్రగతి శీలతలకి వైరుధ్యం గురించి వివరిస్తారు. దాట్ల దేవదానం రాజు రాసిన "వాన రాని కాలం" లో కవిత్వం రాయడం ఆరంభించిన వారు సరైన సాహిత్య వాతావరణం ఏర్పాటు చేసుకోలేక విఫలమౌతుంటారని చెప్పారు. డా. ధేనువకొండ శ్రీరామమూర్తి రాసిన "అమ్మఒడి" గురించి రాస్తూ.. ప్రగతి శీలి అయిన కవి యాంత్రికంగా అలోచించ రాదని, హృదయంతోనే అలోచించాలనీ, కవి యంత్రాల కంటే ప్రకృతికే దగ్గరవ్వాలనీ చెప్తాడు. వింజమూరి అచ్యుతరామారావు రాసిన "ఆకలి శబ్దం" గురించి సమీక్షిస్తూ

## ఎంత గొప్పవి!

భమిడిపాటి స్వరాజ్య నాగరాజా రావు
9393109261



అక్షరాలను పదాలుగా మార్చడానికి
భావంతో వాటిని సమన్వయ పరచటానికి
కవి పడే తాపత్రయం అంతా ఇంతా కాదు.
ముందుగా తన భావాలతో వాటిని బుజ్జగిస్తాడు.
సునిశితమైన తన ఆలోచనల త్రాళ్ళతో,
వాటిని చుట్టుముట్టి బంధిస్తాడు.
ఉహల ఊసులతో వాటిని ఊరిస్తూ,
ఆశయాల బాసలతో ఊయలలూపుతూ
జీవితాన్ని వడపోసే ఆశలతో వాటిని వారిస్తూ,
జోల పాడుతూ,తన ఆదరణతో సేద తీరుస్తూ
తన ఆత్మీయతతో అవి ఆదమరిచేలా చేస్తూ
తన మమతలతో మచ్చిక చేసుకొని,వాటిని జతకలిపి
మనకందించడానికి, వాటిని మన ముందుంచడానికి
కవి పడే తపన,వేదన,
అందుకై అతను చేసే శోధన,సాధన
నిజంగా ఎంత గొప్పవి!

---

"ఈనాటి కవికి కావలసిన ప్రధానమైన అంశం సమకాలీనత యనీ, కవిలో చైతన్యవంతుడు ఉన్నారని నిరూపించేది ఈ సమకాలీనతే అంటారు. ఎస్.ఆర్.భల్లం రాసిన "నీటిభూమి" సమీక్షిస్తూ సాంస్కృతిక విలువల పునరుజ్జీవనం గురించి చెప్తారు. ఆర్.రంగస్వామి గౌడ్ రాసిన "గుండెలోని" సంపుటి సమీక్షలో కవి వ్యక్తిత్వానికి అతని కవిత్వానికి సంబంధం గురించి వివరిస్తూ.."కవి జీవితమూ, అతని వ్యక్తిత్వము - అతను దర్శించే సమాజమూ ఇవన్నీ కలిసి ఒక సమగ్ర సమ్మేళనం" అన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఏ.వీ.ఆర్ మూర్తి రాసిన "కవితా వాహిని" గురించి చెప్తూ "అంతర్లోకాల మధనం, సామాజిక అవగాహనతో కావలసిన పాళ్ళలో కలిస్తే గానీ కవిత్వం రాయడం సాధ్యం కాదు" అంటారు. గ్లోబలీకరణలోని దుష్ప్రయోజనాలను దుయ్యబట్టారు కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి రాసిన "దుక్కి చూపు" కవితా సంపుటి సమీక్షలో. చలపాటి వీర వెంకటేశ్వర రావు రాసిన "అక్షరవీణ" ను సమీక్షిస్తూ.. సమాజం, ప్రకృతి, మనస్సు ల మధ్య గల సహ సంబంధాన్ని విపులీకరించారు. బి.హనుమరెడ్డి రాసిన "పల్లెకు దండం పెడతా" సంపుటిలో మనిషి సమాజంలో కోల్పోతున్న విలువల గురించి వివరించారు. కర్రి కార్తికేయ శర్మ రాసిన "వెన్నెల గాచిన అడవి" లో కవి, కవిత్వం లో తన జీవితాన్ని కేంద్రబిందువు చేసుకుంటే గొప్ప వాస్తవికత సాక్షాత్కరిస్తుందని తెలియ జెప్పారు. మాకినీడి సూర్యభాస్కర్ రాసిన "సెలవ రోజు" ను సమీక్షిస్తూ ఈ దేశపు మౌలిక విలువలే సవాలు చేసే పరిస్థితి నెలకొందని ఆవేదన వ్యక్తం చేస్తూ సార్వభౌమత్వం, సర్వసత్తాకం, అలీన విధానం మొదలైన ఉదాత్తమైన రాజ్యాంగ విషయాలన్నీ కాలదోషం పట్టే రోజులని వాపోయారు. వేముల ప్రభాకర్ రాసిన "భూమి పుత్రులు" పుస్తకాన్ని గూర్చి చెప్తూ మట్టితనం కోల్పోయిన సమాజంలో బతుకుతున్నామన్న బాధను వ్యక్తం చేసారు. ఉండవిల్లి మల్లిఖార్జున రావు రాసిన "శిధిల స్వరాలు" లో ఈ నాటి యువకులు కవిత్వం ఏ వస్తువును తీసుకుని రాయాలో మార్గ నిర్దేశం చేశారు డా.అద్దేపల్లి.

కవిత్వం రాస్తున్న వారు, రాయాలనుకునే వారు తప్పనిసరిగా డా.అద్దేపల్లి రాసిన "గీటు రాయి" నాలుగు సంపుటాలు క్షుణ్ణంగా చదివి, తమ గుణ దోషాలను బేరీజు వేసుకుని కవిత్వం రాస్తే అది నాలుగు కాలాలపాటు ప్రజల నోళ్ళల్లో నాన గలదు. ఎందుకంటే, ఈనాడు మనకు భౌతికంగా, సాంకేతికంగా ఎంతో అభివృద్ధి చెందుతున్న సమాజమూ, అలాగే సాంస్కృతిక విలువలు నశించి పతనమౌతున్న సమాజమూ రెండూ ఒకే సారి సాక్షాత్కరిస్తున్నాయి. కవులు అయోమయ అగమ్య గోచరాలకు గురి అవుతున్నారు. కారణాలు ఇదమిత్థంగా తెలియరాకున్నా ఈ దుష్ఫలితాలను భావితరాలు అనుభవించవలసి రావడం దురదృష్టకరం. కవులు తమ ఆవేదనలను అనంత ముఖాల్లో వ్యక్తపరచాలని డా.అద్దేపల్లి రామమోహనరావు పడ్డ ఆవేదన లో అర్థం ఉంది. అనుసరించాల్సిన అవసరం ఉంది.

# సమకాలీన కవిత్వ చిత్రణ 'పునాస'




- సిద్దెంకి యాదగిరి
9441244773

*దాదాపు పదిహేనేళ్లపాటు రాసిన కవితల్ని కుప్ప పోసి 'పునాస' రూపంలో 2006లో ప్రచురించాడు. అప్పటికీ ఉన్న సంప్రదాయాన్ని కాదనీ, తన కవితా శీర్షికలు కాదని పుస్తకానికి శీర్షిక పెట్టాడు. పునాస అనేది వర్షాధార పంట. ఈ పదాన్ని తెలంగాణలో వాడుతారు. అలాంటి నూత్న ఒరవడి ద్వారా పుస్తకం తెచ్చి తెలుగు కవిత్వంలో సుస్థిర స్థానంతో తనదైన ముద్రవేసుకున్నాడు.*

గాయం మనిషికి తగిలినా, మనసుకు తగిలినా గాయపు తాలూకు గురుతులు నిలిచిపోతాయి. వాటిలో తడిమి చూసుకున్నపుడు చలించే మనసు అతులాకుతలం చేస్తుంటది. ఎతల ప్రవాహాన్ని అక్షరాలతో దేవి (వెతికి) మనసుకు హత్తుకునే విధంగా అల్లినపుడు బాధలు గాథలవుతాయి. గేయాలవుతాయి. కవితలవుతాయి. ఎందరికో భవిత అవుతుంది. తన ఎతల్ని ఎదలోతుల్లోని బాధల్ని అక్షరీకరిస్తున్న కవి తైదల అంజయ్య. వెలివాడ బతుకు వలస జీవితంలో, వలపోతలో చదువుతో చుట్టూ ఉన్న బతుకుల్ని చదివినోడు. తన కవిత బతుకుల్నే చిత్రిస్తున్నాడు. సిద్దిపేటకు డిగ్రీ చదవడానికి వెళ్లినప్పుడు నందిని సిధారెడ్డి గారి పరిచయం ఎడారిలో వసంతాగమనమైంది. మంజీర రచయితల సంఘం ఇచ్చిన ప్రోత్సాహం కొత్త విషయాన్ని నేర్చుకునేలా చేసింది. దాదాపు పదిహేనేళ్లపాటు రాసిన కవితల్ని కుప్ప పోసి 'పునాస' రూపంలో 2006లో ప్రచురించాడు. అప్పటికీ ఉన్న సంప్రదాయాన్ని కాదనీ, తన కవితా శీర్షికలు కాదని పుస్తకానికి శీర్షిక పెట్టాడు. పునాస అనేది వర్షాధార పంట. ఈ పదాన్ని తెలంగాణలో వాడుతారు. అలాంటి నూత్న ఒరవడి ద్వారా పుస్తకం తెచ్చి తెలుగు కవిత్వంలో సుస్థిర స్థానంతో తనదైన ముద్రవేసుకున్నాడు. తనది మొదటి పుస్తకమైనా రంగినేని ట్రస్టు అవార్డు, ఉమ్మడిశెట్టి అవార్డ్ పొందింది. తన మొదటి పుస్తకం ద్వారా పరిపక్వత చెంది ప్రసిద్ధుడయ్యాడు. మరో పుస్తకం 'ఎర్రమట్టి బండి'. 'పునాస' ప్రస్తుతం శ్రీ కృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. చదువుతున్న (పీ.జి) విద్యార్థులకు పాఠ్య పుస్తకం.

తైదల అంజయ్య బాల్యం పూల పానుపు కాదు. పల్లేరు కాయల పరుపు. ఇంటిపేరు తైదల ఒంటి నిండా ఆకలి. పేరు అంజయ్య గంజి కూడా దొరకని దీనస్థితి. ఆకలిని గెలుచుటకు అడవిని ఆశ్రయించి రకరకాల కాయల్ని తిని ఆకలి చల్లార్చుకున్నోడు. 'నాకు బాల్యం లేదు' అని మాక్సిం గోర్కి చెప్పినట్లు కవిక్కూడా బాల్యం లేదు. అంతేకాదు. 'నా కుగాదులు లేవు. ఉషస్సులు లేవు. అని దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్యక్తీకరించినట్లు అంజయ్యకు కూడా లేవు.

బాకీల బాధలు వెంటబడి తరిమితే వలసపోయిన కుటుంబం అంజయ్యది. తల్లిదండ్రులు పనిల. వాళ్లని చూస్తూ

ఒంటరి జీవితం గడిపాడు. తన ఈడు వాళ్లతో ఆడుకున్న దాఖలాలు లేవు. ఏడిస్తే ఓదార్చే వాళ్లు లేరు. బాల్యం అడవిలో పొద్దూకింది (పొద్దూంది). అడవిలో తెల్లారింది. ఒంటరితనం బాధించకున్నా బాధిస్తూనే ఉంటది. శిక్షించకున్నా శిక్షిస్తనే ఉంటది.



తైదల అంజయ్య

ఎవరైన తన అయ్యవ్వల గురించి, పూర్వీకుల గురించి ఉన్నదానికంటే అధికంగా చెపుతరు. కుండ పగలగొట్టినట్లు నిజం చెప్పుతడు ' కరువుకు / మనుషులను అమ్ముకున్నప్పటి / ఆకలి చావు మా తాత / అప్పులను తీర్చుటకు / కడుపు గట్టుకు వలస బతుకు మా అయ్యా / చినిగిన అంగిలాగుతో / బడిలో చేసే జండా వందనం నేను" (ఇండియన్ హెరిటేజ్)లో తాతది, తండ్రిది. తన బాధను మూడు చరణాల్లో వొదువని మూడు తరాల గోపను ఆవిష్కరించిన ప్రయోగం.

*కవి ఎదిగినా ఒదిగే లక్షణాలను కల్గివున్నాడని కవిత్వం చదివితే గాని తెలియదు. దళితుడు అందునా మాదిగ కులం. ఆ బాధల్ని అనుభవించినోడు. తన మూలాల్ని మరిచిపోలేక ఆనాటి బతుకుల్ని అక్షరాల్తో అతికిస్తున్నాడు.*

ఈ కవిత తనదనుకున్నట్లే రాసుకున్నాడు కానీ తన కులానికంతటికి వర్తించబడింది. సిద్దిపేట నుండే కాక వివిధ ప్రాంతాల నుండి ఆర్మూర్, నిజామబాద్ లాంటి పట్టణాలకు వలసెల్లిన అనేక మందిని, దేశంలో అత్యధికంగా వలస పోయే పాలమూరు లేబర్లని వలస జీవితాలను చిత్రించడం వలన సార్వజనీనమైంది. ఈనాడు ఉద్యోగాలు చేస్తున్న మాల మాదిగ కుటుంబాల పిల్లల దుస్థితి చినిగిన చెడ్డీలతో, చెప్పుల్లేని కాల్లతో, పాఠశాలకు వెల్లడం సాధారణమే అయినా ఆనాటి సమాజ దుస్థితిని ప్రతిబింబిస్తుంది. కూడు, గూడు, గుడ్డలేని భారత ఆర్థిక సంక్షోభానికి అద్దం పట్టింది.

కవి ఎదిగినా ఒదిగే లక్షణాలను కల్గివున్నాడని కవిత్వం చదివితే గాని తెలియదు. దళితుడు అందునా మాదిగ కులం. ఆ బాధల్ని అనుభవించినోడు. తన మూలాల్ని మరిచిపోలేక ఆనాటి బతుకుల్ని అక్షరాల్తో అతికిస్తున్నాడు. " దొడ్డికాడ దొరతీయించిన బస్కీలు / అడుక్కోని తొడుక్కున అంగీలు / నలిగే ఎండుటాకుల చప్పుళ్ళు / నేను రాసుకునే రాతలు' తన బతుకున ' నేపథ్యం' ద్వారా వెల్లడి పరుస్తాడు.

గ్రామంలో ఏ వైపు వెళ్లినా నేలంతా భూస్వాములదే. వంటచెరుకుకైనా, శిత్పలకాయలకైనా, బలుసుకు పండ్లనైన అడవిలో తెచ్చుకొని తినాల్సిందే. ఆ సమయంలో దొరకంట్లే పడితే వివిధ శిక్షలు భరించాల్సిందే. అలా బస్కీలు (గుంజీలు) తీశాడు. పెయినిండ అంగీల్లేక పాతవి ఉన్నవాల్లను అడుక్కొని తొడుక్కునుడే...... ఇలాంటి జీవితం ఈ కవికుంది కాబట్టే ఆకలి బాధ ఆకలి అవుతున్న వాడికే తెలుసు. 'మంటలచే మాట్లాడించి / రక్తంచే రాగాలాపన చేస్తాను' అన్న శ్రీశ్రీ గుర్తుకు వచ్చే విధంగా ఎండుటాకుల్లాంటి జీవితాలను రాస్తానని స్పష్టతని ఇచ్చాడు కవి.

డబ్బు పేరున మనిషి జబ్బుల్ని అరువు తెచ్చుకుంటున్నాడు. మందులతో నయంకాని నయవంచనల్ని తెగుడుతూనే ఆకలిని వెంటాడుతూ పరిగెత్తుతాను అంటాడు. వివిధ దుఃఖాల్ని జయించడానికి అనేక రకాలుగా నిరంతరం శిక్షణ పొందుతూ ఉంటానని భరోస కల్పిస్తున్నాడు. జీవితాన్ని విమర్శిస్తున్నాడు కవి. మాథ్యూ ఆర్నోల్డ్ పేర్కొన్నట్లుగా జీవిత విమర్శనమే కవిత్వం ' **(Poetry is the critisizm of life)** అన్నట్లు కవిత్వీకరిస్తూ ' నిశ్శబ్దపు చీకట్లో చుట్టూ పాతివున్న ఖడ్గాల్లోంచి/ దుఃఖపు సముద్రంలో విలపిస్తున్న / మాతృమూర్తుల శోకాన్ని పూరించే / పదునెక్కిన నదినై ప్రవహిస్తాను' అని 'దుఃఖితచలనం' లో దుఃఖము లేకుండుట కోసం నదీప్రవాహం అయి ప్రవహిస్తానని 'తరుగు లేదు విశ్వనరుడ నేను' అనే గుర్రం జాషువ మాటలను స్ఫురణకు తెస్తున్నాడు.

కుటుంబానికి పెద్దదిక్కు తండ్రి. తల్లి ఒడి శిశువుకు మొదటిబడి. తండ్రి మొదటి గురువు. తను నేర్చిన ప్రతిపనిలో ఆదిగురువు తండ్రియని వివరిస్తాడు. మోదుగు దొప్పలో బలుసుకు పండ్లు తినిపించి అడవిలో ఆకలి తీర్చిన అయ్య. మొల్దారం పట్టుకొని ఈతనేర్పిన గురువు. అయ్య పాడిన గోగుపూల రాగాలను స్మరణ చేసుకుంటూ 'నాకు మొదటి రక్షకతంత్రం / నువ్వునేర్పిన పాము మంత్రం / నిలువు విషపు మనిషిమీద / పనిజేస్తలేదే అయ్యా' అని మనిషి మీద పారనందుకు లోలోన మదనపడుతూ ఆక్రోశిస్తున్నాడు కవి.

ప్రతి తండ్రి తన కొడుకు ఆర్థిక స్థితిమంతుడవ్వాలని కోరుకుంటాడు. మానవ విలువల్ని పెంచుతూ, మనుషుల్ని ప్రేమించాలని ఆచరించి చూపాడు. అంజయ్య తూ.చ.తప్పక

ప్రాటిస్తున్నాడు. ఇంకా తండ్రి గురించి "నన్ను బతుకు బాటలో నడిపినందుకు / నన్ను రూపాయి వేటగాన్ని చేయనందుకు ధన్యున్ని" అని కృతజ్ఞతా భావంతో వేస్తున్న ప్రతి అడుగులో నాయన చిటికెన వేలు పట్టుకొని నడుస్తున్న తదాత్మ్య స్పృహను కల్గిస్తున్నాడు.

*మాదిగ అస్తిత్వపు పునాదుల్ని ఆదిలో వేసిన సాహిత్యకారుల్లో అంజయ్య ఒకడిగా నిలిచిపోతాడు.*

తండ్రి కాలం చేశాడు. జ్ఞాపకాల ఊబిలోంచి రాలేదు. వలల పడిన జంతువోలే గిలగిల కొట్టుకుంటూ అయ్యను స్మరిస్తున్నాడు. అయ్య తొవ్వ కవికి పంచాక్షరీ మంత్రం. మంత్రణం, అయ్య దున్నిన పొలం వేసిన చేనులో అయ్య గురుతులు తడిమి చూసుకుంటున్నాడు. ఆ అనుబంధాన్ని కవిత్వం చేస్తున్నాడు. ఆకాశం వెంట పరిగెడుతున్న రథచక్రాలను భూమార్గంలో దించిన శ్రీశ్రీ బాటలో అంతకు ఎక్కువ నాయినను పరివ్యాప్తం జేస్తూ.... 'అతడు లేని మొక్క జొన్న చేను / చంటి బిడ్డల్ని చంకనెత్తుకొని శవయాత్రలో పాల్గొన్న / బాలింతల సమూహం వలె వుంది' అయ్య పోయిన పరిస్థితిని అప్పుడే శవయాత్రలో పాల్గొన్న సమూహాన్ని (విజువలైజేషన్) దృశ్యీకరణగా చూపుతాడు. కవి ఎన్నుకున్న ప్రతిరూపము (ఇమేజ్) ఇది.

అంతా తండ్రి గురించే కాదు. తల్లి గురించి కూడా ఎంతో హృద్యంగా వ్యక్తీకరించాడు. పట్ట పగలు 'సల్ల గట్క' (సల్లగలక)తో ఆకలి తీర్చింది. సలి అన్నం తను తిని, ఉడుకు బువ్వ తనకు వెట్టింది. తన బతుకును ధారవోసింది. తను పస్తులుండి కొడుక్కోసం (అన్నం) ఆకలి తీర్చిన అమ్మను అక్షరీకరించాడు. 'నా రెండు చేతుల్తో గాల్లోకి ఎగరేసిన / పసిపాప కన్నుల్లో ఆమె / ఇంకా మానని గాయాలతో ఆమె / నడుస్తున్న నా ప్రయాణం తుమ్మల్లో గుంకిన నల్లపొద్దు / నా తల్లి' అని తల్లి గురించి అద్భుతంగా వివరించాడు. నల్లపొద్దు అనే మాటవల్ల ఈ కవితకు మరింత అందం చేకూరింది.

పై రెండు కవితల్లో ఎక్కడా మాదిగ కుల స్పృహ స్వగతంగా చెప్పబడలేదు. మాదిగ అస్తిత్వపు ప్రతీకలైన మాదిగ పనిముట్ల వాడకం, డప్పుకొట్టడం లాంటివి ఎక్కడా ఆ ఛాయలు అగుపించలేదు. వతన్ లేకపోవడం / మాయితనం – చేతులు ) లేకపోవటాన్ని చిల్లరోల్లు అని పిలుస్తుంటారు. రెండోది బతికి చెడ్డ మాదిగ కుటుంబమై ఉంటుందని ఊహించాను. అంజయ్య రెండోది నా జీవితం అన్నాడు. అందువల్ల ఆ అనుభవాలు రాశిపోశాడు.

మనదని ప్రేమించిన ఏదైనా కళ్లముందు కూలిపోతూంటే విలవిలలాడిపోతుంటాం. దీనులకు దిక్కయ్యి అక్కున చేర్చుకునే గుడిసె కాలితే అంజయ్య మనసు చేరువైన తీరు మనల్ని ద్రవింప జేస్తుంది. తమ గుడిసె గురుతులు నెమరేసుకుంటూ ***'మా గుడిసె కాలినపుడు / ఇంట్లో పీనుగెల్లినంత బాధయింది*** అనీ, ఇదే కవితలో 'గుడిసె కాలినపుడు మా అవ్వకు / కడుపుగాలినంత దు:ఖం'** అని వ్యక్తీకరించటం ఎంతో ఉన్న ఆర్ద్రతను ఎక్కెక్కి దిక్కులు చూసిన బాధల్ని దిగమింగిన బతుకులు తేట తెల్లమవుతాయి.

వెలివాడల ఎతలు కడు దుర్భరం. ప్రతిపనిలో ముందుండే మాదిగలు కుల వివక్షకు అడుగడుగున గురి అవుతున్నారు. తెలుగు కవిత్వంలో దళిత వాదంది ప్రత్యేకమైనది. దళిత కవితల సంపుటిలో 'చిక్కనవుతున్న పాట'లో చాటింపు కవిత ద్వారా ***'మా తాతల బాకీలకు తాకట్టైనోల్లం / మీ పొలాలకు కాలువలై పాకినోళ్ళం'*** అని రెండు వాక్యాల ద్వారా తరతరాల తాకట్టును పంటను పండించిన సత్తువను వివరించాడు. ***'మా శక్తి పండిన పంటే కదా....! / ఆ పంట రుచిచాలదా...?'*** అని ప్రశ్నిస్తూ తిరుగుబాటు ఉసిగొల్పుతాడు. మరోచోట ***'మేమంతా మీ ముందు / చెప్పులు చేతబట్టుకొని నడువాల్నా / చర్మం వలచి చెప్పులు కుట్టుడే కాదు / డొక్క చీల్చి డోలు గొట్టేది మేమే / మేమెంత వెనుకబడ్డ వాల్లమైనా / మేం ముందుంటే మీ పెండ్లీలు ఊరేగించబడుతయ్'*** అని వాస్తవీకరిస్తాడు. అణుకువకు ఆగ్రహమొస్తే ఫలితమేమవుతుందో ముందుగా ప్రకటిస్తాడు.

మరో కవిత ***'పదును'*** లో ఒక అడుగు ముందుకేసి ***'సాహసించి చచ్చిన గొడ్డు చర్మ మొలిచి / అన్నింట ముందున్నందుకు అంటరాని 'హాన్నయినాను'*** అని అంటరానితనం గురించి చెపుతాడు. 'చరిత్ర తెలియని వాడు చరిత్ర సృష్టించ'లేడన్న అంబేద్కర్ మాటల్ని నిజం చేస్తూ, ఇజాన్ని ప్రకటిస్తాడు. ***'నేనిపుడు కలలు కనేది / నిన్ను చక్కగా నడిపించే చెప్పుల నమూనా కోసం / ఇక నుంచి ఊరవతలి మా గుడిసెల్లోంచి / పనిగట్టుకొని నూరుతున్న / పనికత్తుల***

*శబ్దాలు వినిపిస్తాయి'* అని రేపటి తిరుగుబాటును ముందే వినిపిస్తున్నాడు.

మాదిగ అస్తిత్వపు పునాదుల్ని ఆదిలో వేసిన సాహిత్యకారుల్లో అంజయ్య ఒకడిగా నిలిచిపోతాడు.

అంజయ్య మనాది మట్టి. మదినిండా మట్టివాసన. అయ్యవ్వ మట్టికూలీలు మట్టిని నమ్ముకున్న రైతన్న, మట్టి పుత్రులన్నా అంజయ్యకున్న అభిమానం. ఎడతెగని ప్రేమ. **Integral 'x' Zero to Infinity** అనే కవితలో "వడ్లెన్ని పండిన యంటరుగని/ఎడ్లెన్ని జచ్చినయనరు" అని రైతు గోస మూలకాన్ని, నాడిని పట్టుకుంటాడు.

పెరుగన్నం తినాల్సిన రైతు అప్పుల్ని భరించలేక పరగడుపున పురుగుల మందు తాగి ప్రాణాలొదులుతుంటే కవి హృదయం బద్దలైంది. పత్తికాయ పగిలి....నీ రైతులు చెల్లిపోతున్న బాధల్ని విప్పుతున్నాడు. మదనపడుతున్నాడు. వేదన పడుతున్నాడు అని మనకు అవగతమవుతుంది.

*'ఒక నిరంతరమైన ఆకలి / చెమటను పరిహసించే రూపాయి కలసి / ఇప్పట్దాక తలెత్తుకున్న మనిషిని అవమానపరుస్తాయి / పచ్చని పంటకే కాదు/ ఇవాళ మనిషితనానికీ పురుగు పట్టింది.'* అని చిత్రిస్తాడు. నిరంతరమైన ఆకలితీర్చే రైతుపైన రూపాయి (వ్యాపారం) తలెత్తుకున్న మనిషిని అవమాన పరుస్తాయని తెలుపుతాడు. చేనుకు పురుగు, రైతుకు బాకీ పురుగైందంటాడు.

రైతును తడిమే కవిత్వాన్ని విస్తృతం జేస్తూ *'ఏటు జూసినా మంటలే / నిప్పు కనవడది / పాలు పట్టిన కంకిని వొలిచి చూస్తే ( చేతి వేళ్ళకు నెత్తుటి తడి / దరిదొర్కది అప్పుదీరది'* అని నీటి దుఃఖాలుగా కరువు రక్కసిని, భయంకర రూపాన్ని ముద్రిస్తాడు. పంటను, కంకిని ముట్టుకుంటే అంటుకునేది కంకి కాదు. పంట పండించే రైతు, నెత్తురు తడిగా వ్యక్తీకరించటం జీవికను పట్టి చూపటమే. 'అప్పుదీరది, దరిదొర్కది' అని నిజ పరిస్థితి ప్రకటిస్తున్నాడు కవి.

మనిషి దేన్ని ప్రేమిస్తే మనిషితనం పెరుగుతది? మనిషిని, మట్టిని ప్రేమించాలని చెప్పిన గురజాడను స్ఫురింపజేస్తూ ఉన్నాడు. *'జీవితమంటే వికసించి; మట్టి / మట్టిని శ్వాసిస్తేనే మనిషిగుండె విస్తరిస్తుంది'* అని మట్టి పరిపూర్ణతని వివరిస్తాడు. మట్టిలో పంటలతోపాటు, పొత్తిల్లలో మరణించిన రైతుల త్యాగాలు మననం చేసుకుంటే మనిషికి పరిపూర్ణతనిచ్చే మట్టివాసనను తనివితీరా పీల్చుకుంటే మనిషి(గుండె) మహోన్నతంగా విస్తరిస్తుందని నమ్మబలుకుతాడు.

ధ్వంసమవుతున్న పల్లెను గురించి బహుముఖ కోణాల్లో ఆవిష్కరించారు. పల్లెల విధ్వంసమనగానే గోరేటి ఎంకన్న 'పల్లె కన్నీరు పెడుతుందో కనిపించని కుట్రల' అనే పాట అందరికీ గుర్తుకు వస్తుంది. ఈ పాట తొంభై దశకంలో వచ్చింది. బహుశా 2000-01 లో వచ్చింది. అంతకు ముందే పల్లెబతుకుల పగుల్లను దర్శించాడు. స్పర్శించి సృశించాడు అంజయ్య. ఈ కవితని 1993లో రాశాడు.

*'మా ఊరంటే / వేపచెట్టు కింద గుడిసె ముందు / చెప్పులు కుట్టుకుంటూ/ముసలయ్య పాడే/ భాగోతపు పాట కాదిపుడు / ఉన్న కులవృత్తీ ఊడిపోయి/ రెక్కల కష్టాన్ని నమ్ముకుని 'కానరాని దేశాలు పోయే కడుపుకోత'* అంటూ మాదిగ కులవృత్తి పతనమైందని వివరించాడు. 'కృతిమత్వాన్ని పూసుకొని/ వినిపించే టేప్‌రికార్డు పాట'గా వివరించాడు. ఈ విధంగా పల్లెలో ధ్వంసమవుతున్న విధానాన్ని ప్రభావవంతంగా, ప్రతిభావంతంగా పేర్కొన్నాడు. మా ఒక్క ఊరే కాదు. అన్ని ఊళ్లు అలాగే ఉన్నాయి. వివిధ రూపాల్లో ఆధునీకరించబడ్డాయని పేర్కొనడం అంజయ్య తార్కిక, తాత్విక దృష్టికి మచ్చుతునకగా చెప్పుకోవచ్చు.

అంజయ్య కవితలు ఆలోచింపజేసే విధంగా ఉంటాయి. ఆయన కవితలు సమకాలీన అంశాలను సమర్థవంతంగా ప్రతిబింబిస్తాయి. ప్రాంతాలకు, అతీతంగా, కులమతాలకు అతీతంగా సర్వజనామోదం పొందే విధంగా ఉన్నాయి. ఏ కవితను ముట్టుకున్నా మనిషి తడి హత్తుకుంటుంది. మానవత్వ విలువలు పెంచుతుంది.

ముందుమాటల్లో వరవరరావు " 'పునాస' ఆశ్చర్యంగా వానకాలపు పంట వల్లె ఉండడం, నన్ను నా జ్ఞాపకాల్లోకి తీసుకువెళుతుంది." అని పేర్కొన్నారు. "ఒక మంచి కవికి ఉండవలసిన అన్ని ప్రాథమిక లక్షణాలు అంజయ్యలో ఉన్నాయి. జీవితమంతా మహా యుద్ధవాక్యాన్ని రాయాలని కోరుతున్నాను." అని కె. శివారెడ్డి ఆశించారు.

ప్రేమతో మోహన్‌సార్ "కవిత్వంతో అబద్ధాలు చెప్తాడు. అంజయ్యని నమ్మొద్దు దొంగ" అని వివరిస్తాడు.

సర్వకాలాల్లో సర్వామోదము పొందే కవిత్వ సంపదను సృష్టిస్తున్నందుకు మనమూ స్వాగతిద్దాం.

❋

# ఓ కొమ్మ స్వేచ్ఛ



- ర్యాలి ప్రసాద్
9494553425

సాయంత్రం అడవి చివర స్మశానంలో సమాధిమీద విత్తనాన్ని చీల్చుకుని లేలేతగా కొమ్మొకటి అంకురించింది. ఉదారంగు సంధ్యాసమయానికి భయపడి గట్టిగా ఆర్తనాదం చేసింది. కొమ్మ పక్కనున్న ముదురు ఆకులూ రెమ్మలూ ఆ కొమ్మను లాలిస్తూ భయంలేదని నిమురుతూ కొత్తఆకుల్ని అనునయించాయి. "నేనెక్కడున్నానూ" అంది లేలేత కొమ్మ చీకట్లోంచి.

"యిక్కడే సమాధిపైనే"

"యిక్కడికి నేనెలా వచ్చాను"

"కొత్త సమాధితో పాటు"

"ఎక్కడి నుండి వచ్చావు?"

"ఎదురు కాల్పుల్లోంచి..."

"ఎలా... ఎలా...."

"యుద్ధంలో వీరుడి జీవకణంలో దాగున్న నేను యిక్కడికెలా వచ్చానో..."

"వారం క్రితం యిక్కడ ఒకతన్ని దహనం చేసారు. వంటినిండా బుల్లెట్‌గాయాలు. చనిపోయినా అతని కళ్ళలో ఏదో మెరుపు. దేనికోసమో ఆశ. ఎంత ఆకర్షణీయంగా ఉన్నాయని".

"అవునవును గుర్తుకొస్తుంది. బుల్లెట్లు ఎవరో వెనకనుండి కాల్చడం నేనెరుగుదును. నన్ను మోసుకొచ్చినతను" దొంగ వెధవల్లారా! పిరికోళ్ళలా వెనకనుండి కాలుస్తారా' అని బాధగా కూలిపోవడం గుర్తుంది' కొమ్మకు గొంతెండిపోతుంది. "అమ్మా దాహం" అంది. పక్కకొమ్మ వేగంగా కదిలింది. వెన్నెల కరిగిపడిన మంచుబిందువులు నీరై కొమ్మ పెదవుల మీద పడ్డాయి. అలసిపోయిన కొమ్మకోసం చుట్టుపక్కల చెట్లన్నీ ఊగేయి. చల్లని తడిగాలి వీచింది. హాయిగా ఉంది కొమ్మకి. పక్క చెట్లతో అంది "అక్కల్లారా! మీరెలా ఉంటారు. ఒక్కసారి చూడొచ్చా."

చంద్రుడెళ్ళి సూర్యుడురానీ ఈ చీకట్లు కరిగిపోతాయిలే అప్పుడు చూద్దుగాని"

"యివేంటి నా మీద యిలా పాకుతున్నాయి. ...హి...హి...హి... చక్కిలిగింతలు పెడుతున్నాయి. హి.... హి..."

"అవి చలిచీమలు ఏమీ చేయవు. కానీ వాటిని ఏమైనా చేయాలని చూస్తే యిక అంతే.... చుట్టిముట్టి చంపేస్తాయి...."

"ఊరికే ఏమీ చెయ్యవు కదా!"

"ఈ అడవిలో ఊరికే ఏవీ ఏమీ చెయ్యవు. వాటిని బాధిస్తే తప్ప"

"నిన్ను అమ్మా అని పిలొచ్చా"

"ఓ తప్పకుండా"

"ఎవరైనా మీ నాన్నెవరని అడిగితే ఏం చెప్పనూ..."

"మా నాన్న వీరుడని చెప్పు. అతని సమాధి మీదే కదా మొలిచావు"

నెమ్మదిగా ఆకాశం నల్లని దుప్పటి తొలగించింది. రేకులపై నీటిబొట్లను విదిల్చుకుంటూ పెనవేసుకున్న రెమ్మల్ని తప్పించుకుంటూ పైకి చూసింది. వ్యాపించిన పరిమళాలలో నీడలు తెల్లగా మెరుస్తున్నాయి.



"అమ్మా"

"ఊఁ"

"నువ్వు ఎవరిని అల్లుకుని ఉన్నావ్. నన్ను కూడా ఎవరైనా యిలా అల్లుకుంటారా"

"కొంచెం ఎదగాలి. యిప్పుడే పుట్టావు కదా!"

ఆకుల మధ్య నుండి లేత పసుపూ ఎరుపూ కలగలసిన రంగుతో తుపాకీ గుండ్లలా కిరణాలు పొడుచుకొస్తున్నాయి.

"అమ్మా"

"ఊఁ"

"యివేమిటి? శతృవులెవరైనా మనమీద దాడి చేస్తారా...

"లేదమ్మా అవి సూర్యకిరణాలు. అలా చూడు ఆ పూలు సూర్యుని వైపు ఎలా విడుచుకుంటున్నాయో...! ఆ కిరణాల వల్లే లోకంలో చైతన్యం కలుగుతుంది.

"నిజమా"

"కొత్త కొమ్మ.. కొత్త కొమ్మ" ఎవరో పిలుస్తున్నారు. మందారాలూ, మర్రి ఊడలూ, చింతచెట్లూ వెన్నెల్లో తేలి తేలి ఉన్నారేమో కొత్తదనంతో మెరిసిపోతున్నారు. మంచు బిందువుల్లో స్నానాలు చేసి వచ్చారుకదా భలే స్వచ్ఛంగా ఉన్నారు. ఆకులమీద రాలిన మంచు కరిగి ఆరిపోయింది.

"అరే యిపుడే కొత్తగా వచ్చావా"

"ఎంత పచ్చగా, లేతగా ఉందో కదా!"

"అవునే.... ఎవరో వీరుడంట... ఎదురుకాల్పుల్లో ఒరిగిపోయాడంట... అతని సమాధిది. దీనిమీద పెరిగిందీ చిట్టితల్లి"

ఒక్కొటొక్కటిగా చెట్లన్నీ దగ్గరకు జరిగాయి. తమ కొమ్మల్నూపి ఆకుల దొప్పల్లో దాగిన జాబిలి చినుకులతో కొమ్మను కడుగుతున్నాయి. పచ్చని పురుటివాసన కొమ్మను వదలడం లేదు.

"ఏయ్ నువ్వు ముందు ఎక్కడుండే దానివో తెలుసా...?

"హాయ్ ఎంత మెత్తగా ఉందో.... హాఁ... ముళ్ళుకూడా వున్నాయి మెత్తగా....

"ఏయ్ నన్ను ముట్టుకోనీ... వెలుగురేకలన్నీ దాటి సూర్యుడు సంపూర్ణంగా కనిపిస్తున్నాడు. ఇలా ఎప్పటినుండో. ఏయే లోకాలను దాటో... అనేకానేక రూపాలున్నా వదిలిపెట్టని నీడ.

"అమ్మా! నా కింద ఈ నల్లని వారెవరు?"

"అది నీ నీడేనమ్మా"

"నీడంటే ఏంటి? నేను తీసుకురాలేదే!?

"అది నీతోనే పుడుతుంది. నీతోనే పెరుగుతుంది. నువ్వున్నంత వరకూ నీతోనే ఉంటుంది. అది నీ రూపానికి నకలు" చీకట్లోంచి బైటికొచ్చాక లోకమంతా కొత్తగా ఉంది. అక్కడక్కడా పూలు పూస్తున్నాయ్ రంగుల్లో. కొమ్మలు కొన్ని గుబురుగా, మరికొన్ని వదులుగా. కొందరాడవాళ్ళు సజ్జలతో వస్తున్నారు. బహుశా ఏ కోవెలలో వెళ్ళేందుకు. వాళ్ళ పుణ్యం కోసం పూపిల్లల కుత్తుకలు తెంపేస్తున్నారు. వాళ్ళకు పుణ్యం మాటేమోగానీ ఈ పూపిల్లలు అంత నిర్దాక్షిణ్యంగా...."

మౌనం... అలుముకున్న నిశ్శబ్దం.

"ఏంటాలోచిస్తున్నావ్. మనల్ని కూడా అలా తెంపేస్తారా.."

"పిచ్చితల్లీ! అలాగేం లేదమ్మా. పూలనైతే ఆడవాళ్ళు తలలో పెట్టుకుంటారు. దేవుళ్ళ ముందు , నాయకుల ముందూ పెడతారు మన జోలికెవరూ రారులే. ఫరవాలేదు. వాళ్ళకేవిధంగానూ మనం పనికిరాము. కనుక మన జోలికి రారు. ఏం పర్లేదు."

నెమ్మదిగా నిలువునా పచ్చదనపు తళతళల్లో మెరుస్తుంది. ఈనెల దగ్గర సన్నని ప్రవాహపు తళుకు. ఎంతో అంతులేని కాంతి. సముద్రాన్ని ఈదుకుని వస్తున్న గాలిని ఆకాశం నిండా పొంగే పరిమళాలు. ఎండలో సర్వసమగ్రంగా కన్పిస్తున్నాయ్. తనతో పాటే కొత్త కొత్త కొమ్మలు లోకాన్ని చూడ్డానికి వరసకట్టాయి. తనేమో ప్రత్యేకంగా ఎర్రగా మెరుస్తూ రెమ్మని ఊపింది. ఆకుల మీదున్న సూర్యచంద్రులు నీటిలో కరిగి నేలపై పడ్డారు. అదేపనిగా చప్పట్లు కొట్టింది ఆనందం పట్టలేక.

అమ్మచెట్టు వెనకనుండి నవ్వుతూనే ఉంది. అడవంతా ఒకటే ఫీంకారం మురిపాలు ఒలకబోస్తూ ఏదో మధువు తాగినట్లు, దిగంతాల ఆవల దాగినట్లు.



ఎవరో ఒకతను నల్లగా మెరిసే దేహంమీద నుండి సన్నని పూరజను జల్లుకుంటూ పోయాడు. ఎర్రని కళ్ళు స్రవిస్తున్న యవ్వనపు క్రౌర్యంతో తనను పట్టించుకోడేమి? తీయని బాధను భరించేదెలా? ఆవేదన నుండి జారిపోయేదెలా? అతను నా వైపు వస్తాడేమో? నాలోని వ్యతిరేక క్షణాలకు ఏదో.... ఏదో తెలియని రంగు పూస్తున్నాడు. బాబోయ్ దగ్గరకు వచ్చేస్తున్నాడు. అయ్యో పక్కనుండే పోతున్నాడే.

పట్టించుకోడేం మళ్ళీ భయం, బాధ, ఆతృత, ఆనందం, ఆరాటం. అంత యింత తిరుగుతున్నా యింకా రాడేమి? పెద్ద కొమ్మ వెనక మెరుస్తున్న పూలతో ముల్లోకాల సౌకుమార్యాన్ని పంచుతున్నాడు.

"నా నుండి పో" అంది ప్రేమగా

అధికారం సంతరించుకున్న ఆ మాటలో ఎంతో సొంతమైన భావం ఎరుపెక్కిన ఈనెల్ని పచ్చరంగులోకి మార్చేదెలా, పచ్చదనపు మదాన్నంతా ఎలా తొలగించడం. నిజమే! నిన్నటి నా అంశకు, మూలం ఆ వీరుడే కదా! ఎదురు కాల్పుల్లో రక్తమోడిన దేహంతో అజేయంగా నిల్చి సమాధిలో విశ్రమిస్తున్నాడు. యుద్ధం గెలవడమా లేదా అన్నది సమస్య కాదు. ఎవరి వాదాల నుండి ఎవరికి వారే విజేతలు. నిజమైన యుద్ధంలో విజేతలూ, పరాజితులూ ఉండరు. జయాపజయాలు కేవలం ఓ లెక్కల నమూనాయే! సూర్యకిరణాలతో పాటే ఓ ఆకలిపవనం వచ్చి తాకింది. ఒక దైనందిన యుద్ధం రెక్కలు సాచింది. విజయం తమ సొంతమేనని ప్రకటనలు చేసాయి. లేతకొమ్మ చివర రెండు మృదువైన ఈనెల మధ్య మెత్తగా నూగులాంటి అనుభూతి. రెండు ఆకుల తొడల్ని రెండువైపులా చీల్చి తన కిరణాల్ని మెల్లగా పైన రాపాడించి, సరళత పొందాక నెమ్మదిగా పంపింది కిరణం.

"అమ్మ! తీయని బాధతో అరిచింది. తన్ను మొత్తం ఆక్రమించుకున్నాడు కిరణం. పచ్చదనాన్నంతా జుర్రేస్తున్నాడు. ఎక్కడో ఎప్పుడో గుర్తుకురాని లోకాలను వివరిస్తున్న జ్ఞాపకం ప్రాణం పోతున్నట్లు. కొత్త ప్రాణానికి వీర్యదానమేదో చేస్తున్నట్లు యింకా... యింకా... సూదంటు వెలుతురు జ్వాలల ఒడిదుడుకుల విన్యాసం వెనక్కీ ముందుకూ పయనిస్తుంది. మేఘం తొలగినపుడు ముందుకు పోతూ అడ్డురాగానే నిలిచిపోతూ ముందుకీ, వెనక్కూ విడదీసిన ఆకుల లేతదనంలో తెలియని మెత్తదనం కొత్తలోకాల్లోకి బిగుసుకుంటున్న పిడికిళ్ళలో తీపి మూలుగుల తాదాత్మ్యంలో కూరుకుపోయింది. కిరణం చల్లబడింది. ఆకులు పూర్తిగా విచ్చుకున్నాయి. చిరుచెమట్లు బిందువులు బిందువులుగా అమర్చినట్లు నిల్చున్నాయ్. కిరణం ఆయాసపడుతూ పక్కకు ఒత్తిగిల్లి పడుకుని ఉంది. రెండు ఆకులూ కిరణాల్ని కప్పి ఉంచాయి. కావలించుకుని పరిమళ గంధాలు వీస్తూ ఉన్నాయి. కొన్నిచోట్ల విజయ దరహాసాలు ముదరకొమ్మల్నుండి ప్రవహిస్తున్నాయి.

"అమ్మా!" బాధనూ, సంతోషాన్నీ పంచుకునేందుకు అమ్మ చెట్టు జవాబు లేదు. మళ్ళీ వెనక్కి తిరిగి చూసింది. అతను అసహనంగా వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉన్నాడు. "నన్నొదిలి పోకు" లోపలే అనుకుంది. బైటికనే ధైర్యంలేక. అయినా అంది వెళ్ళిపోతాడేమోననే భయంతో "ఫో" అంది. అతనికీ భావాలతో ఏ పనీ లేదు. నిర్లిప్తంగా ఉన్నాడు.

చిన్న చిర్నవ్వు మలయ పవనంలా వీస్తూ...

అతను సంతృప్తిగానే కళ్ళలోకి ప్రేమగా చూసాడు. నా కన్యత్వానికి ఎంత హాయినిచ్చాడు. వెలుగు వచ్చేసరికి నాలో ప్రవేశించి అద్భుత లోకాన్ని పరిచయం చేసాడు. ఇప్పుడు నాతో ఎవరుంటారు? అతను విదిల్చి పోయిన పుప్పొడి మరో కొమ్మనో, ఆకునో సృష్టించి లోకమ్మీద విడిచిపెడుతుంది. ఇంతవరకూ నాకో తోడుగా ఉన్నవాడు మరో తోడిచ్చిపోయాడు. అతన్లా నేనూ ఓ జెండానైతేనా, నా ప్రతాపం చిన్న చిన్న కొమ్మలు, రోజుల కొమ్మలన్నీ చుట్టూ చేరి కిరణానికీ నాకూ మధ్య జరిగిన విషయాన్ని కుతూహలంగా అడుగుతున్నాయి. కిలకిలమని మధ్యలో నవ్వుకుంటున్నాయి. బోల్డంత సిగ్గుగా ఉంది అయినా కొంచెం గర్వం అందరూ పొగుడుతూ ఉంటే. రహస్యంగా ఎవరికీ కనపడకుండా తనలోకి చూసుకుంది. లోతులతో, బరువులతో నిండుదనంతో పోతపోసిన సౌందర్యంతో... తాను పొంగిపోయింది.

# అన్నా జర యిటు గూడ ...!



- విజయ్ కోగంటి
8801823244

మీరు నిజంగానే గొప్పోళ్ళన్నా
మాలో కొందరికి మిమ్మల్నిచూస్తే
గుండెలుప్పొంగుతాయన్నా
ఎంత మాయగా నవ్వుతారన్నా
రోజూ విని పోయే మాటలైనా
ఎంత ప్రేమగా చెప్తారన్నా?
మాకోసం ఎంత కష్టపడుతున్నారన్నా?
నిన్న మొన్నటి దాక మాతో వున్నోడూ
మీతో జేరి చల్లంగ కార్లల తిరుగుతున్నాడన్నా!

మేమంటే మీకు ఎంత ప్రేమన్నా?
అందిన చోటల్లా 'దాహం'తీర్పిస్తున్నరు
మాకోసం నగరాలు నిర్మిస్తున్నరు
ఆకాశంలో రైళ్ళు తిప్పుతానంటున్నరు
మా కాళ్ళేమో నేలనుండవట్టె
పైకిజూత్తే ఏమీ కానరాక మెడలు నొప్పివట్టె
చూస్తే కళ్ళు బైర్లు తిరుగుతున్నె అన్నా
కొంచెం సమజవ్వక గడబిడైతున్నమన్నా
అన్నా! మీ పాకేజీలు టాబులు గీబులు
మెట్రోలు గట్రాలు, మేకినిండియాలు
మాకొద్దు గానీ
మా పురుగు మందులు మామీద
పనిచేయకుండ చూడండన్నా
బుక్కెడు బువ్వ తినేట్టు చూడండన్నా
మా పిలగోళ్ళకిబడులంటే
అసయ్యం పుట్టకుండ చూడండన్నా
ఆస్పత్రుల కెళ్ళి  ఎలుకల నోట్ల బడకుండ
బతికొచ్చేట్టు చూడండన్నా
రోడ్లమీద బద్రంగ నడిచి ఇల్లు జేరేట్టు చూడండన్నా
మీ  గ్లోబలు ఇస్కూళ్ళకి, మీ ఇస్టార్ల ఆస్పత్రులకి మేం
పోలేంగద!

మీకు కుదిరినప్పు
మీ ఏసీ కార్ల నుంచీ, మూసిన గదుల్నించీ
వర్షం కురిసిన రోజుల్ల, అమాస రోజుల్ల
మీ యల్ యి డీలు వెలగని వేళల్ల
మీ గోదార్లు మా కాల్వల్ల పొంగిన వేళల్ల
మేము తిరిగే రోడ్లల్ల నేలమీద నడిచొచ్చి
మా సంగతులు కూడ జర వినుకోండన్నా

అన్నలూ అటు దేశాల్నే గాదు
మమ్మల్ని గూడ జర జూస్కోండ్రి.

❋

---

కిరణం వెళ్ళిపోయాక సన్నని మంట మొదలైంది. ఎక్కడో. తన ఆకుల్ని ఎండకు అప్పజెప్పి గాలి వీస్తుంది అకులమీద నాట్యం చేస్తూ. లేలేత గులాబీరంగుతో జీవితం మొదలుపెట్టింది నెమ్మదిగా. ఓ ఎర్రని పూవేదో తన గర్భాన్నీ చీల్చుకుని నెమ్మదిగా బైటికి వస్తున్నట్లుంది. సూర్యుణ్ని తెంచిదాచిన కిరణ సమూహాలు శాంతిగీతాలతో అహింసా సూత్రాలు వల్లిస్తున్న ముదర వృక్షాల్లో మింగేసిన వెలుతురు పిట్టలు. గుబురు మూలలో దాగిన వేయి నాలుకల చీకటి.

నెమ్మదిగా పూవు తన రేకులు వదులుచేసింది. దూరం దూరంగా విస్తరించాయవి. స్వేచ్ఛానుభూతి కన్నీటి ఆనందం, ఆనందపు వెలుతురులో... ఎండుటాకుల నుండి దిగంతాల ఆవలి నక్షత్రాల దాగే ఓ మహాకాంతి వలయపతాకాలు ఎగురుతున్నాయి. చీకటిని తింటూ బతికిన క్షణాల్ని చంపుతూ కిరణం చేయి పట్టుకుని లోకం మీదకు దూకింది. ఇక భయంలేదు, అసహనం లేదు, సందేహాల్లేవు, సందేశాల్లేవు. పట్టుకున్న వేలును నిర్దాక్షిణ్యంగా వదిలేసే చేతుల్లేవు... ఉన్నదల్లా... స్వేచ్ఛ....!

*(గుడిపాటి వెంకటాచలానికి ప్రేమతో....)*

❋

## విశ్వనరుడు

- సత్యభాస్కర్
9848391638



ఒక్కో ముద్ర
ఒక్కో రూపం
దేహం ఒక్కటే!

ఒక్కో ప్రాంతం
ఒక్కో దేశం
నేల ఒక్కటే!

ఒక్కో మాట, ఒక్కో భాష,
ఒక్కో యాస
భావం ఒక్కటే!

ఒక్కో రుచి, ఒక్కో తిండి
ఆకలి ఒక్కటే!

ఒక్కో భోగం, ఒక్కో సుఖం
మనిషి ఒక్కటే!

ఒక్కో మరణం
చావు వొక్కటే!

రూపం వేరు
దేశం వేరు
భాష వేరు
తిండి తిప్పలు వేరు
సుఖ భోగాలు వేరు
అయినా
చావు పుట్టుకలొక్కటే
మనుషులంతా ఒక్కటే!

## తను

- మోతుకూరి శ్రీనివాస్
9866061350



వాడిన పసుపు నవ్వు
జారిన కురుల వెండి తీగలు
గుండెలు దాటని శబ్దం
దీపకాంతిలో దేవకి
ఆమె ముఖం
లేత చిగురులా మెరిసింది
తను ఒక సందేహ రాగం

2
నిశబ్దంలో
ఆమె గొంతు విప్పింది
విరిగిన గాయం
అనంత శోకాన్ని మోస్తున్న
రెండు తనువుల ఒక బరువు
మూసిన తలుపులు
తనకు తను ఒక విదేహం

## కడుపుగాసం

- కృష్ణమణి
9866767876

ఏమున్నది సారు
కడుపుకాలి ఒకడుంటే
పెయ్యిబరువెక్కి
నోరు గులాగులాంటోడు ఇంకొకడు

ఇత్నం కొనవోతే
తక్వ ధర ఎక్వ లాభమని
గుంజి గుంజి చేత్లవెడతరు
ఏమున్నది సారు

నాగలి సాగక తిప్పలైతే
ట్రాక్టర్ సొందుకు
గుద్లు తెలేశ్నై ఎడ్లు
ఏమున్నది సారు

తడందక ఎండిపోతే ఒకపారి
నీళ్ళెక్కువై మురుగవట్టే ఒకపారి
ఏమున్నది సారు

శేనుకు మందుగొడుతుంటే
కారాపి నక్షలు సూస్కుంటా
నొసల్తోని ఎక్కిరిస్తరు
ఏమున్నది సారు



చేశేదేమి లేక
నాగలి తాళ్ళు
చెట్టుకు యాలాడవట్టే
ఏమున్నది సారు

ఇంకేమిలేదు సారు
ఉన్నదమ్ముకొని
ఊరవతల జీతముండాలే
పోరల మంచి చెడ్డ మరిశి
కడుపుగాసం బతుకులాయే

ఏమున్నది సారు
ఇంకేమున్నది

## నిశీధిలో నక్షత్రం కథలు

మీనాక్షి శ్రీనివాస్

వెల : 125/- పేజీలు: 270

ప్రతులకు : 9492837332

కథల్లో సరళమైన నిత్య వ్యవహారంలో ఉండే భాష కథల్ని అలవోకగా నడిపించింది. అదే కథను ఆపకుండా చదివిస్తోంది. చురుకైన సంభాషణలు కథలకి మరింత పఠనాసక్తిని పట్టుకొచ్చాయి. కథలన్నీ మొదలు పెడితే వెంట వెంటనే చదివెయ్యవచ్చు.

- వాడ్రేవు వీరలక్ష్మీదేవి

## మూలవాసి

ప్రగతిశీల ముస్లిం కవిత్వం

రసూల్‌ఖాన్

వెల : 50/- పేజీలు: 88

కవిత్వం ఎవరి పక్షం వహించాలో, కవిత్వ పరమార్థం ఏమిటో తెలిసిన కవిగా రసూల్‌ఖాన్ ఈ 'మూలవాసి' కవిత్వంలో మరింత స్పష్టం అయ్యాడు. అలంకారాలు, ఇమేజరీలు, సింబల్స్ కోసం పాకులాడని కవిత్వ వ్యక్తిత్వం వల్ల సీరియస్ విమర్శకులు పట్టించు కోకపోవచ్చు కానీ, ఖచ్చితంగా ఈ కవిత్వం నిర్దేశిత వర్గాలను చేరుతుందనటంలో అతిశయోక్తి లేదు.

- డా॥ నూకతోటి రవికుమార్

## కవన సేద్యం కవిత్వం

కెంగార మోహన్

వెల : 100/- పేజీలు: 104

ప్రతులకు : 9494892561

అస్తిత్వమిప్పుడు ఓట్ల గాలంలో ఇరుక్కుంది వంటి పదాలు, వాక్యాలు మొక్కవోని మోహన్ ప్రగతిశీల స్వభావానికి నిదర్శనాలు. కవన వాత్సల్యం, కలంపోరు, అక్షరప్రభంజనం, కవన సేద్యం వంటి శీర్షికలు మోహన్‌లోని కవిని మనకు పట్టి చూపుతాయి.

- రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి

## వారి తీరే వేరు (వ్యంజకాల సంపుటి)

పొత్తూరి సుబ్బారావు

వెల : 100/- పేజీలు: 100

ప్రతులకు : 9490751681

మంచి చెడుల భావ వైవిధ్యం. ఒక అంశం యొక్క ఇరు పార్శ్వాలనూ కలిపి విలువైన నాణెంగా చూపించడమే ఈ వ్యంజకాలు చేసే పని. వారి తీరే వేరు అనే ఈ సంపుటి సమాజహిత చింతనాసారుతో పఠిత్వలోకాన్ని ఆకట్టుకోగలదని ఆకాంక్ష. వ్యంజకాల రూపశిల్పి పొత్తూరి సుబ్బారావుగారిని మనసారా అభినందిస్తున్నాను.

- సుధామ

## అవ్యక్తం దీర్ఘకవిత

ఆత్మకూరు రామకృష్ణ

వెల : 150/- పేజీలు: 168

ప్రతులకు : 9493405152

ఈ దీర్ఘ కవిత నిర్మాణాన్ని అత్యంత శ్రద్ధతో నిర్వహించారు రామకృష్ణ. కవితకీ, కవితలో ఎడనెడ సాగే భావాలకీ పొసగే భాషను ఎంచుకున్నారు. ఒక అంతర్లయ ఉంటే దీర్ఘ కవిత అందగిస్తుంది. తండ్రి మరణంతో ఏర్పడిన ఒకానొక భావోద్విగ్నతతో పలకడం వల్ల, ఆ అంతర్లయ దానికదిగానే సిద్ధించిందీ కవితలో.

- విహారి

## గెలిచి నిలిచిన గళం

బండి చంద్రశేఖర్

వెల : 80/- పేజీలు: 95

పతులకు : 9440087930

తెలంగాణ వచ్చేవరకు తెలంగాణ వాదుల మానసిక స్థితి ఎటువంటిదో? వాళ్ల ఆవేశం, ఆక్రోశం ఎటువంటిదో? నిరాశా, నిస్పృలు వాళ్లనెట్ల చిందర వందర చేసినయో? ఈ ప్రశ్నలకు మాటల్లో జవాబు చెప్పడం అంత సులభం కాకపోయినా ఉద్యమ సందర్భంలో కొంతమంది తెలంగాణ కవులు తెలంగాణ హృదయ గాయాన్ని అద్భుత కవిత్వంగా మలిచినరు.

- బండి చంద్రశేఖర్

## శిఖరం




**అటల్ బిహారీ వాజ్‌పేయి కవిత్వం**

**అనుసృజన : జలజం సత్యనారాయణ**

వెల : 100/- పేజీలు: 96

ప్రతులకు : 9849444944

ఈ అనువాదంలో ఆ నష్టమేమీ కనిపించకపోగా అనువాదకుడు కవీ, భావుకుడు కూడా కాబట్టి మరింత పుష్టమైందనే భావించవచ్చు. కలగబోయే నష్టాన్ని ఆయన ఉభయభాషా సంస్కారం పూరించిందనడంలో విప్రతిపత్తి లేదు. వాజ్‌పాయి పేరు చెప్పకపోతే ఇవి జలజం వారి కవితలే అన్నంత సహజంగా ఉన్నాయి.

– డా.ఎన్.గోపి

## ఆకు కదలని చోట కవిత్వం




**బాలసుధాకర్ మౌళి**

వెల : 116/- పేజీలు: 135

ప్రతులకు : 9989265444

ఏ పరిమళమూ ఏ చలనమూ లేని / వాడిన పూలలాంటి / అన్ని నిర్జీవ అక్షరాల మధ్య-/ తడి కళ్లను పొదువుకొని / కళ్ల ఆకాశంలో కదిలే రెక్కల మేఘాల్ని తొడుక్కొని / ఎగిరే / కాసిన్ని ఆ అక్షరాల పక్షులే / కొంత కాంతి, కొంత వెలుతురును / గదిలోకి వెదజల్లుతాయి/ తరగతి గది / మూగ జంతువులా వుంటే ఏం బాగోదు / కళ్లూ చెవి వుండి / రగులుతున్న మంటలాంటి అడవిలా వుండాలి.

– బాల సుధాకర్ మౌళి

## చంద్రవర్షం




**భగ్వాన్**

వెల : 80/- పేజీలు: 112

ప్రతులకు : 9393533336

ఈయన కవిత్వం పాఠకుల మానసిక పరిధుల్ని విస్తృతపరుస్తుంది. కాంతివంతం చేస్తుంది. ప్రకృతిని, అందులో అంతర్లీనంగా ఉన్న మనిషిని ప్రేమించడం నేర్పుతుంది. జీవితం పట్ల ఒక ఆశని, ఒక గౌరవాన్ని సౌందర్యీకరిస్తుంది. బాధ్యతల్ని తక్షణ కర్తవ్యాల్నీ గుర్తు చేస్తుంది. సరళతలో గాఢత ఈయన కవితా రహస్యం!

– దేవరాజు మహారాజు

## అందినంత చందమామ




**(సోమసుందర్ సాహితీ సంస్పర్శ)**

**అవధానుల మణిబాబు**

వెల : 80/- పేజీలు: 50

ప్రతులకు : 9490760779

శ్రీ మణిబాబు ఎదురైన అవరోధాలన్నిటినీ వరాన్తం చేస్తూ, ఉత్సాహం జారవిడుచు కోకుండా సకల కళాసంపన్నంగా ఎదిగి వస్తున్నాడు. అతడు లోగడ ఒక సాహిత్య విమర్శా గ్రంథాన్ని, ఒక కవితా సంపుటినీ ప్రచురించాడు. గతానుగతికత్వం పోకార్చి, స్వీయ కవితాముద్రను ప్రకటించుకున్నాడు. ఇప్పుడీ పుస్తకంతో నూతన పరిధులు స్పర్శిస్తున్నాడు, సాధిస్తున్నాడు.

– డా॥ ఆవంత్స సోమసుందర్

## 'అమ్మకోసమైన...'




**Energizing Indian Youth**

**శ్రీమతి పత్తి సుమతి**

వెల : 60/- పేజీలు: 64

ప్రతులకు : 8790499405

ఆ 'ఆత్మహత్యలు' సామాన్యమైనవి కావు. పెడత్రోవపడిన 'యువత'ను తీర్చిదిద్దవలసిన విశ్వవిద్యాలయాలే ఘోర తప్పిదాలు చేస్తున్నాయి. 'కంచె చేనుమేస్తే చందం'గా విశ్వవిద్యాలయ పాలకవర్గ పోకడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.... విద్యార్థులు అప్రమత్తమయి మెలగాలని ఆశిస్తూ...

– శ్రీమతి పత్తి సుమతి

## ఈ గాయాలకు ఏం పేరు పెడదాం?




**డాక్టర్ భీరం సుందరరావు కవిత్వం**

వెల : 150/- పేజీలు: 144

పతులకు : 9848039080

నిజాయితీతో కూడిన అతని ఆత్మిక, సామాజిక, రాజకీయ విశ్లేషణలన్నీ కలిపితే అతను వందశాతం సామాజిక కవి. అందుకే అతని వస్తువంతా సామాజికమే, రాజకీయమే. చాలా కవితల్లో రాజకీయాల మీద నిర్దాక్షిణ్యంగా దాడిచేయడమే కనిపిస్తుంది.

– కె. శివారెడ్డి

## కళా సౌందర్యం




**చిత్రకళా వ్యాసాలు**

**ఎల్.ఆర్. వెంకటరమణ**

వెల : 80/- పేజీలు: 96

ప్రతులకు : 9866158908

చిత్రకళకీ, సాహిత్యానికీ, తెలుగు సమాజానికీ గల అంతర్గత సంబంధాన్ని దర్శింపజేశారు. ఈ విధంగా ప్రతివ్యాసంలో ఓ కొత్తకోణాన్ని చూపారు. కనుకనే తెలుగు చిత్రకళని అధ్యయనం చేసేవారికి సిలబస్‌గా ఉపకరిస్తాయి వెంకటరమణ రచనలు. అంతేగాక, చిత్రకళ మీద ఆసక్తినీ, అనురక్తినీ ఇనుమడింప జేస్తాయి.

– గుడిపాటి

## తెలంగాణ విస్మృత వీరుడు కేవల్ కిషన్




**బెల్లంకొండ సంపత్ కుమార్**

వెల : 40/- పేజీలు: 48

ప్రతులకు : 9989265444

ఈ వినిర్మాణంలో భాగంగా తెలంగాణ దళిత, బహుజనుల స్ఫూర్తిదాయకమైన చరిత్రను సామాజిక తెలంగాణ సోయితో వెలుగులోకి తేవాలె. అందులో భాగంగానే పేద ప్రజలు, భూమిలేని రైతు, కూలీలకు అండగా, దొరల దౌర్జన్యాలకు, అణచివేతకు వ్యతిరేకంగా గొంతు విప్పిన ప్రజా నాయకుడు కేవల్ కిషన్ జీవితాన్ని ఇప్పుడు రేఖా మాత్రంగా మీ ముందుకు తెస్తున్నాం.

– ఫోరం ఫర్ కన్సర్న్‌డ్ బీసీస్

## శ్రీకృష్ణదేవరాయలు



**యస్.డి.వి. అజీజ్**

వెల : 100/- పేజీలు: 96

ప్రతులకు : 8106367175

భారతదేశాన్ని పాలించిన పేరెన్నికగన్న పాలకుల్లో శ్రీకృష్ణదేవరాయలు ఒకరు. 16వ శతాబ్దం నాటి సామాజిక వ్యవస్థ మరియు రాచరిక వ్యవస్థ ఎలా వుండేది? శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించిన జీవిత విశేషాలతో పాటు వాటి చరిత్రను సన్నివేశాల రూపంలో కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరించిన రచన ఇది.

– ప్రచురణకర్త

## చెరకు గడల కొరడాలు




**లయన్ గడల శివప్రసాద్**

వెల : 40/- పేజీలు: 72

ప్రతులకు : 9494229437

చెరుకు గడల కొరడాలతో కుల వివక్షత, మహిళా బిల్లు ఆలస్యం, స్వచ్ఛ భారత్‌లోని లోపాలు, వంశపారంపర్య రాజకీయాలు – సినీ పరిశ్రమ, కలనిజమైతే, ఊసరవెల్లి సిగ్గెడుతోంది, పిండంపెట్టండి ఆంధ్రప్రదేశ్‌కు అన్న కవితలలో తనదైన శైలిలో అన్యాయాలపై, అక్రమాలపై తన భావాలను వ్యక్తపరిచారు.

– డా॥ వుయ్యపు హనుమంతరావు

## పాంచజన్యం కవిత్వం




**డా॥ వుయ్యపు హనుమంతరావు**

వెల : 50/- పేజీలు: 40

ప్రతులకు : 9849425750

ఇందులో మరుగైపోతున్న ప్రాకృతిక సౌందర్యంతోబాటు, మనుషులు క్రూర రక్కసులై సామాన్యుల పీకలకు ఉరిత్రాళ్ళు పేనుతూ, రక్తం కక్కిస్తున్న కాల్‌మనీ కర్కశత్వం వరకూ ఎంతో వస్తు విస్తృతి ఉన్నది. వాటిపట్ల కవి తన ఆవేదనను, ఆక్రోశాన్నీ వెళ్లగ్రక్కడం మనం చూడగలం.

– జి. సుబ్బారావు

## తెలంగాణ సాహిత్య పీఠికలు




**డాక్టర్ బన్న అయిలయ్య**

వెల : 200/- పేజీలు: 296

పతులకు : 0870-2456001

ప్రాంతీయ అభివృద్ధి, సంక్షేమం గురించి సాహిత్యంలో వ్యక్తీకరించిన తీరు ఈ సంకలనంలో ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. రెండు దశాబ్దాల సాహిత్యంలో సంక్షేమం, అభివృద్ధి, సాంఘిక సంక్షేమ హాస్టళ్ళ విద్యార్థుల అభివృద్ధి రెండూ కలిసి ఈ సంకలనం

– బి.ఎస్. రాములు

# ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన సన్నాహక సమావేశం



అనంతపురంలో ఫిబ్రవరి 12న జరిగిన 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన' రాష్ట్ర సదస్సు సన్నాహక సమావేశంలో ప్రసంగిస్తున్న సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి. చిత్రంలో రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, మస్తాన్‌వలి, పి. కుమారస్వామి, వొరప్రసాద్, జంధ్యాల రఘుబాబు ఉన్నారు.

ప్రజాకవి వేమన తెలుగు వారు గర్వించదగ్గ ప్రజాకవి అని, మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా, హేతువాద భావజాలాన్ని తన పద్యాల ద్వారా చాటాడని సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి అన్నారు. వేమన భావజాలాన్ని ప్రజల్లోకి విస్తృతంగా తీసుకెళ్ళడమే ఈ ఆహ్వాన సంఘం లక్ష్యమని అన్నారు. ఫిబ్రవరి 12న అనంతపురంలోని పోలీస్ వెల్ఫేర్ కాంప్లెక్స్‌లోని సిద్ధార్థ ఫంక్షన్ హాలులో జరిగి ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన ఆహ్వాన సంఘం సన్నాహక కమిటీకి ఆయన ముఖ్య అతిథిగా హాజరయి ప్రసంగించారు. శతాబ్దాల క్రితమే ప్రజల్లో చైతన్యవంతమైన భావాలు వెదజల్లిన వేమన నిజమైన ప్రజాకవి అన్నారు. జిల్లాలోని సాహిత్య, సాంస్కృతిక, సామాజిక సంఘాలే కాకుండా రాష్ట్రవ్యాప్తంగా అందరినీ భాగస్వాములను చేసి వేమన్న సాహిత్యంపై రాష్ట్రస్థాయి సదస్సును విజయవంతంగా నిర్వహించాలని కోరారు. సభాధ్యక్షత వహించిన ప్రముఖ విమర్శకులు రాచపాళం చంద్రశేఖర్ రెడ్డి మాట్లాడుతూ ఈ రోజుకీ వేమన భావాలు ఎంతో ప్రాసంగితను కలిగి ఉన్నాయన్నారు. ఇంకా సమాజం వేమన్నను అందుకోలేకపోతుందని అన్నారు. ఈ సందర్భంగా సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ రాష్ట్రస్థాయి సదస్సు నిర్వహణకు ఆహ్వాన సంఘ కమిటీని ప్రతిపాదించారు. అందరినీ భాగస్వాములను చేసి ఏప్రిల్ నెలలో ఈ సదస్సును నిర్వహించాలని సభ తీర్మానించింది. ఈ కార్యక్రమంలో ప్రముఖ కథకులు సింగమనేని నారాయణ, సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధాల్య రఘుబాబు, రాష్ట్ర కమిటీ సభ్యులు పి. కుమారస్వామి, కెంగార మోహన్, మస్తాన్‌వలి, ప్రముఖ కవి రాధేయ, రియాజుద్దీన్, అక్బర్ సాహెబ్, మల్లెల నరసింహమూర్తి, వై. సూర్యనారాయణరెడ్డి, శ్రీనివాసులు, మాదాల శ్రీనివాస్, మహేష్, రవిచంద్ర అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాల నుండి వివిధ సంఘాలకు చెందిన ప్రతినిధులు పాల్గొన్నారు, అనంతరం జరిగిన ప్రెస్‌మీట్‌లో తెలకపల్లి రవి, రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, వొరప్రసాద్, పి. కుమారస్వామి పాల్గొని పత్రికా ప్రతినిధులకు ఆహ్వాన సంఘ వివరాలను ప్రకటించారు.

## ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన రాష్ట్ర సదస్సు ఆహ్వాన సంఘం

**ఛైర్మన్:** సి. ఆంజనేయరెడ్డి, విశ్రాంత ఐపిఎస్ అధికారి, **అధ్యక్షులు:** రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి. **ప్రధాన కార్యదర్శి:** పి. కుమారస్వామి. **కోశాధికారి:** రవిచంద్ర. **ఉపాధ్యక్షులు:** వొరప్రసాద్, జంధ్యాల రఘుబాబు, ఎస్.ఎమ్.డి. ఇనయతుల్లా, **కార్యదర్శులు:** కెంగార మోహన్, మస్తాన్‌వలి, కె. సత్యరంజన్, ఎం. ప్రగతి, ఓ. వెంకటరమణ. **గౌరవ సలహాదారులు:** కొలకలూరి ఇనాక్, కేతు విశ్వనాథరెడ్డి, తెలకపల్లి రవి, సింగమనేని నారాయణ, ఎం.వి. రమణారెడ్డి, బండి నారాయణస్వామి, శాంతినారాయణ, టి. సంజీవమ్మ, ఎ.జి. వేణుగోపాలరెడ్డి, షేక్‌హుస్సేన్ సత్యాగ్ని, సూర్యసాగర్, పత్తి ఓబులయ్య, డా॥ వి. పోతన్న, మల్లెల నరసింహమూర్తి, నడ్లపల్లి చిదంబరరెడ్డి, రాష్ట్రస్థాయిలో అరసం, సాహితీస్రవంతి, జనసాహితి, విరసం తదితర సంఘాలతో పాటు రాయలసీమలోని సాహిత్య, సాంస్కృతిక, దళిత, బహుజన, సామాజిక, కళా సంస్థలన్నిటినీ ఈ కార్యక్రమంలో భాగస్వాములు కావల్సిందిగా ప్రెస్‌మీట్ ద్వారా విజ్ఞప్తి చేశారు. వివరాలకు పి. కుమారస్వామి (అనంతపురం 9490122229, జంధ్యాల రఘుబాబు (కర్నూలు) 9849753298, మస్తాన్‌వలి (కడప) 9490099284, ఓట్ర వెంకటరమణ (చిత్తూరు) 9494512930 ద్వారా సంప్రదించవలసిందిగా కోరారు.

# జి.వో.నెం. 14ను రద్దు చేయాలని కోరుతూ విజయవాడలో ఒకరోజు సత్యాగ్రహం



మాతృభాషా మాధ్యమ వేదిక ఆధ్వర్యంలో విజయవాడలో ఫిబ్రవరి 19న ధర్నాచౌక్‌లో జరిగిన ఒక రోజు సత్యాగ్రహ దీక్షలో పాల్గొని సంతకం చేస్తున్న వి. బాలసుబ్రహ్మణ్యం, సామల రమేష్‌బాబు, ఎం.వి.ఎస్. శర్మ.

మున్సిపల్ పాఠశాలల్లో ఇంగ్లీషు మాధ్యమాన్ని ప్రవేశపెడుతూ జారీచేసిన జి.ఒ.నెం.14/2-1-2017 వ్యతిరేకిస్తూ ఫిబ్రవరి 19న విజయవాడలో అలంకార హోటల్ వద్దగల ధర్నాచౌక్‌లో మాతృభాషా మాధ్యమ వేదిక ఆధ్వర్యంలో ఒకరోజు సత్యాగ్రహ కార్యక్రమం జరిగింది. రచయితలు, పత్రికా సంపాదకులు, ప్రచురణకర్తలు, ఉపాధ్యాయులు, కళాకారులు, తెలుగు భాషాభిమానులు, వివిధ సంఘాల ప్రతినిధులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. మాతృభాషా మాధ్యమిక వేదిక స్థాపకులు శాసనమండలి సభ్యులు వి. బాలసుబ్రహ్మణ్యం, విద్యావేత్త పరిమి, తెలుగు భాషోద్యమ నాయకులు సామల రమేష్‌బాబు, విద్యావికాస వేదిక ప్రతినిధి రమేష్ పట్నాయక్, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ ఆచార్యులు గారపాటి ఉమామహేశ్వరరావులతో పాటు నాగార్జున విశ్వవిద్యాలయం ఆచార్యులు ఎన్. అంజయ్య, శాసన మండలి సభ్యులు ఎం.వి.ఎస్. శర్మ, ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకురాలు కె. ఉషారాణి, కథా రచయిత సడ్లపల్లి చిదంబరరెడ్డి తదితరులు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సుమారు మూడు వందలకు పైగా నిరసన శిభిరంలో పాల్గొన్నారు. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ విద్యార్థులు, నాగార్జున విశ్వవిద్యాలయం విద్యార్థులు కూడా సత్యాగ్రహ దీక్షలో పాల్గొన్నారు. సత్యాగ్రహ శిభిరాన్ని సందర్శించి దీక్షకు మద్దతు తెలిపిన వారిలో ప్రముఖ కవి ఖాదర్ మొహియుద్దీన్, కొత్తపల్లి రవిబాబు,డా॥ గుమ్మా సాంబశివరావు, డా॥ రావెళ్ళ, వొరప్రసాద్, దివికుమార్, చీకటి దివాకర్, దాసరి రామకృష్ణరాజు, శాసన మండలి సభ్యులు బొడ్డు నాగేశ్వరరావు, ఆచార్య గంగప్ప, బి. హనుమారెడ్డి తదితరులు ఉన్నారు. ప్రజానాట్యమండలి కళాకారులు తెలుగు భాషపై పాడిన గేయాలు శిభిరంలో ఉత్తేజం నింపాయి. శిభిరంలో ప్రసంగించిన వారు ప్రభుత్వం తీసుకొచ్చిన జి.వో.ను పూర్తిగా రద్దుచేయాలని, భాషా విధానాన్ని ప్రకటించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ❋



పాలకొల్లులో త్యాగరాజ భవనంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 19న జి.వో.నెం. 14కు వ్యతిరేకిస్తూ జరిగిన రౌండ్‌టేబుల్ సమావేశంలో మాట్లాడుతున్న సాహితీస్రవంతి పాలకొల్లు కన్వీనర్ వి. శ్రీరామమూర్తి . చిత్రంలో దవేజి, విశ్రాంత అధ్యాపకులు వి.కె. సత్యనారాయణ, పోలిశెట్టి గోపాలకృష్ణ గోఖలే, వంగా నరశింహరావు, కొట్టు భాస్కరరావు, చిన్నకోట వెంకటేశ్వరరావు, రాధారమణగుప్త, జి. సుబ్బారాయుడు, గంటా ముత్యాలరావు, వి.వి. తిరుపతిరాజు, నరసింహరాజు, రామలక్ష్మణ్, పి.శ్రీశ్రీ, యర్రారమణకుమార్ ఉన్నారు.



విశాఖపట్నంలో పౌరగ్రంథాలయంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 19న జి.వో.నెం. 14ను వ్యతిరేకిస్తూ జరిగిన రౌండ్ టేబుల్ సమావేశంలో ప్రసంగిస్తున్న ప్రముఖ సాహిత్యవేత్త చందు సుబ్బారావు. ఈ కార్యక్రమంలో ద్రవిడ విశ్వవిద్యాలయం పూర్వ వైస్ ఛాన్సలర్ కె.ఎస్. చలం, జె.పి. శర్మ, రహిమున్నిసా బేగం, ఇ. పైడిరాజు, ప్రసాద్, జి. మధు, జాజులు, అదపా రామకృష్ణ, దేవరకొండ సహదేవరావు, యర్రానాయుడు, సాహితీస్రవంతి విశాఖ జిల్లా అధ్యక్షులు ఎ.వి. రమణారావు, కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు, ఎస్. నాగరాజు, వైష్ణవి, సుజాతామూర్తి, వై. ఆర్. కె. ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.

## సాహితీ స్రవంతి అనంతపురం నగర కమిటీ ఎన్నిక

సాహితీ స్రవంతి అనంతపురం నగర కమిటీని సరోజిని రోడ్డులోని ప్రజాశక్తి సాహితీ సంస్థ కార్యాలయంలో సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు పిళ్ళా కుమారస్వామి, జిల్లా అధ్యక్షులు డాక్టర్ ప్రగతి, ప్రధానకార్యదర్శి రవిచంద్ర సమక్షంలో ఫిబ్రవరి 17న ఎన్నుకోవటం జరిగింది. నగర కమిటీ గౌరవాధ్యక్షులుగా వై. సూర్యనారాయణరెడ్డి, అధ్యక్షులుగా నగరూరు రసూల్, ఉపాధ్యక్షులు శ్రీధర్‌నాయుడు, ప్రధాన కార్యదర్శిగా అశ్వర్థరెడ్డి, సహాయ కార్యదర్శి హిదయతుల్లా, కోశాధికారిగా కృష్ణవేణి, సభ్యులుగా తోటనాగరాజు, యమున రాంమూర్తి, నరేష్, రియాజుద్దీన్, పోకూరి చంద్రశేఖర్‌లన ఎన్నుకోవటం జరిగింది. ఈ సందర్భంగా పిళ్లా కుమారస్వామిరెడ్డి మాట్లాడుతు జిల్లా వ్యాప్తంగా సాహితీ స్రవంతి శాఖలు విస్తరించి వున్నాయన్నారు. సాహిత్య వేదికగా సాహిత్యాన్ని, కళలన కాపాడేదిశలో సాహితీ స్రవంతి పాటుపడుతున్నదన్నారు. గత సంవత్సరంలో జిల్లా కవులు, రచయితలుగా సాహితీ వేత్తలు చేసిన కృషిని సమాజానికి తెలియచేసే ప్రయత్నం చేసిందన్నారు. అదే క్రమంలో వేమన ఆశయాలను ప్రజల్లోకి తీసుకెళ్లే ప్రయత్నం చేస్తున్నట్లు తెలిపారు. ఏప్రిల్ 30న రాష్ట్ర స్థాయి సదస్సుకు సన్నాహాలు చేస్తున్నట్లు తెలిపారు. ❋

## అనంత సాహితీ సమాలోచన పుస్తకావిష్కరణ



అనంతపురంలో ఫిబ్రవరి 21న ఆర్ట్స్ కళాశాల డ్రామా హాలులో తెలుగు విభాగం, సాహితీ స్రవంతి జిల్లా కమిటీ సంయుక్తంగా అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ సదస్సును నిర్వహించాయి. సిండికేట్ బ్యాంకు సిబ్బంది కెవి.మహిధర్ ఉద్యమ పాటతో కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఆర్ట్స్ కళాశాల ప్రిన్సిపల్ అధ్యక్షతన వహించిన ఈ కార్యక్రమంలో మాతృభాష సంరక్షణ మన కర్తవ్యం అనే అంశంపై ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి మాట్లాడారు. అనంతరం సాహితీ స్రవంతి యేడాది పాటు నిర్వహించిన సాహితీ సమాలోచన కార్యక్రమంలో మునుపటి జిల్లా కవుల జీవిత చరిత్రలను, ఆశయాలను తెలియచేస్తూ రూపొందించిన అనంత సాహితీ సమాలోచన పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో ఏలూరి వెంగన్న, డాక్టర్ రమేష్‌బాబు, ప్రేమ్‌చంద్, పిళ్లా కుమారస్వామి, జిల్లా ప్రధాన కార్యదర్శి రవిచంద్ర, సూర్యనారాయణ రెడ్డి, నగరూరు రసూల్, అశ్వర్థరెడ్డి, లక్ష్మీనారాయణ, మల్లిఖార్జున, జోత్స్న, విజయలక్ష్మి, మాధవీలత, నాగభూషణ, బయ్యపురెడ్డి, రామచంద్రమూర్తి, మహబూబ్‌కాన్, ఉమాశంకర్, తదితరులు పాల్గొన్నారు. ❋



*జనవరి **29**న గుంతకల్లు హిందీ ప్రచారసభలో జరిగిన కార్యక్రమంలో కోడీహళ్లి మురళీమోహన్ రచించిన "ఆంధ్రసాహిత్యములో బిరుదనామములు" అనే గ్రంథాన్ని ప్రముఖ అవధాని డా.ఆశావాది ప్రకాశరావు ఆవిష్కరిస్తున్న దృశ్యం.*



*గుంటూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో ఫిబ్రవరి **12**న జరిగిన చలపాక ప్రకాష్ రచన 'అత్యాధునిక కవితా రూప ప్రక్రియ – నానీ' ఫెలోషిప్ పరిశోధనా గ్రంథ ఆవిష్కరణ సభ. చిత్రంలో ఎస్. ఎం. సుభాని, చలపాక ప్రకాష్, డా॥ ఎన్. గోపి, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, కె. సురేంద్రబాబు, డా॥ చిల్లర భవానీ దేవి, ఎం.బి.డి. శ్యామల*

## 'స్వేచ్ఛా స్వరం' అభినందనీయం

నాకు తెలిసినంత వరకూ 'స్వేచ్ఛా స్వరం' వంటి ప్రత్యేక సంచిక సాహిత్య పత్రికల చరిత్రలో ఎక్కడా వచ్చినట్లు లేదు. అమర్త్యసేన్, హెరాల్డ్ పింటర్, ప్రభాత్ పట్నాయక్ ల వ్యాసాలు ప్రచురించి ప్రత్యేకతను మరోసారి చాటుకున్నారు. ఎంతో అధ్యయనం చేస్తే గానీ ఇటువంటి వ్యాసాలు దొరకవు. మీకు అభినందనలు సరిపోవు. అభివందనలను తెలియజేస్తున్నాను.

**- జయంతి పాపారావు,** విశాఖపట్నం

## 'స్వేచ్ఛా స్వరం' అపూర్వ కానుక

సాహితీ 'ప్రస్థానం' ఓ ప్రత్యేక సంచిక తెస్తున్నట్లు సాహితీ ప్రస్థానంలో విడుదలైన ప్రకటన దరిమిలా తిరుపతిలో జరిగిన జాతీయ లేదూ రాష్ట్రీయ రచయితల వేదికలో ఆ ప్రకటన 50 కాపీలు జిరాక్స్ చేసి పంచడం నా అత్యాశే కావొచ్చు. కానీ బాధ్యతగా భావించాను. డా॥ శమంతకమణి గారి ఒకనొక వ్యాసంలో 'ఓ సభలో ఎలాంటి వారు పాల్గొనవచ్చు' అనే నిర్దేశనం చేశారు. ఆమెకు ధన్యవాదాలు చెప్పకపోయినా ఆచరించే క్రమంలో నిర్వాహకులకు సాహితీ ప్రస్థానం జిరాక్స్ కాపీలు అప్పజెప్పి వెనుకకు వచ్చేశా. అది నా శారీరక మానసిక స్థితి. ఏభై జిరాక్స్ కాపీలు ఎలా ప్రభావితం చేశాయో నాకైతే తెలియదు. 'స్వేచ్ఛా స్వరం ఓ అపూర్వ కానుక. నన్ను అపరిమితంగా ఆకర్షించిన అంశం... 'అమర్త్యసేన్ గారి 'భారతదేశం విశాలమూ – సంకుచితమూ' నాకైతే కొత్తది.

**- మల్లవరపు వెంకటరత్నం, రేణిగుంట**

## సైన్స్ ఫిక్షన్ రచనలు పెరగాలి

ఫిబ్రవరి సాహిత్య ప్రస్థానంలో 'సృజనను పెంచే సైన్స్ ఫిక్షన్' వ్యాసం బాగుంది. రచయిత ఎంత ఎక్కువ ఊహించగలిగితే అంత ఎక్కువ ఉపయోగం ఉంటుంది. ఊహకు సైన్స్‌ను జోడించి రచనలు చేస్తే అనేక అద్భుతమైన నవలలు సృష్టించవచ్చు. కాని ఇందుకు ఎవరూ పూనుకోవడం లేదు. తెలుగులో ఈ సైన్స్ ఫిక్షన్ రచనల సంఖ్య మరింతగా పెరగాలి. ప్రతి రచయితకు బాల్య స్మృతులుంటాయి. ఊహలుంటాయి. పెద్దల కోసం వ్రాసే రచయితలంతా పిల్లల మేథకు పదును పెట్టే ఇలాంటి రచనలకు శ్రీకారం చుట్టాలి. చిన్నారుల కోసం సైన్స్ టచ్ ఉన్న రచయితలు ఒక్క రచన అయినా చేయగలిగితే తెలుగులో మంచి సైన్స్ ఫిక్షన్ రచనలు రాగలవు. వ్యాస రచయిత వెంకట్రావు గారికి అభినందనలు.

**- డా॥ రావెళ్ళ,** విజయవాడ




*విజయనగరంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 14న యాత్రా సాహిత్యంపై దాసరి అమరేంద్రతో జరిగిన సంభాషణ. చిత్రంలో చీకటి దివాకర్, వి.ఎస్. శ్రీనివాస్. పాయల మురళీకృష్ణ 'అండమాన్ డైరీ' పై మాట్లాడారు.*

### FORM IV

(Rule 8)

UNDER PRESS AND REGISTRATION OF BOOKS ACT, 1867
STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS
ABOUT MONTHLY -SHAITYA PRASTHANAM

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Hyderabad |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 4. Publisher's Name | : | V. Krishnaiah |
| 1 (a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 5. Editor's Name | : | T. RAVI |
| Nationality | : | INDIAN |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 6. Name and addresses of owner | : | V. Krishnaiah |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin | : | - |
| Address | : | H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |

**I, V. KRISHNAIAH, here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

Sd/
V. KRISHNAIAH
Publisher

Date: 01.03.2017

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# మాక్సిం గోర్కీ

(1868 - 1936)



ప్రముఖ రష్యన్ రచయిత, కథలు, నవలలు ఎన్నో రాశాడు. నిరుపేదగా, కూలీగా బతికాడు.
ఇతని రచనలు ముఖ్యంగా 'అమ్మ' విప్లవానికి ఎంతో తోడ్పడ్డాయి.
మార్చి 16 గోర్కీ వర్ధంతి

IAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/16-18
PRSVMO2A178
Date of Posting : 02.03.2017 ▪ Date of Publication: 27.02.2017



52

If Un delivered please return to: Prasthanam, C/o M.H. Bhavan, Plot No. 21/1,



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A178 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | kDaveed |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |